

మహాబలిపురం శిల్పాలు
ఫోటో. సి ప్రభాకర్ (మద్రాసు)

ప్రతివారం ఆంధ్రదేశమంతటా లక్షలమంది ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదివి ఆనందిస్తూ ఉంటారు. మీ స్థానిక ఏజెంటు ద్వారా చందాదారులయితే మీ కాపీ మీకు వారం వారం నిశ్చయంగా చేరగలదు.

# ఉత్తరాలు

## ముఖచిత్రం

9—3—62 నాటి పత్రిక ముఖచిత్రం మొదట ఏ ఇంగ్లీషు సినిమాతారదో అని ఆశ్చర్యపోయి, లోపల పేజీలలో ఆ చిత్రాన్ని గురించి వ్రాసిఉండుట చూచి చాలా ఆశ్చర్యపోయాను. మరి కెన్నడీని గూర్చి వ్రాసిన వ్యాసం చాలాబాగుంది!

వి. ఆర్. శేఖర్ (చేబ్రోలు)

*　*　*

## గళ్ళనుడికట్టు

మీ గళ్ళనుడికట్టు మరీతేలికగా ఉంటోంది. కనీసం అరగంటైనా పట్టేటట్టు ఇస్తే బావుండును! పదినిముషాలలో పూర్తిచేసిఅవతల పారెయ్యవలసివస్తోంది. దయచేసి ఆధారాలు కొంచెం కష్టమైనవి ఇచ్చే ఏర్పాట్లు చేయండి!

వి. కె. దీక్షితులు (బాపట్ల)

*　*　*

## ఊమెన్ కార్టూన్

ఈ వారం ఊమెన్‌గారు వేసిన కార్టూన్ చూచి నాకునవ్వు ఆగిందికాదు. ఏ ఎండకా గొడుగు పట్టే రాజకీయవాదులు దీన్ని చూచి సిగ్గుతెచ్చుకుంటారని ఆశిస్తున్నాను. కాంగ్రెసు రాజకీయాలు ముఠా రాజకీయాలుగా మారిపోవటం నిజంగా విచారకరం. ముఠాలవల్ల కాంగ్రెసు సంస్థ ఎంతదెబ్బతిని పోయిందో ఇప్పటి ఎన్నికలు స్పష్టంచేశాయి. నాయకులు ఇప్పటికైనా కళ్ళు తెరవటం అవసరమేమో!

డి. వరదయ్య (విశాఖపట్టణం)

*　*　*

## హమేషా తమాషా

ఈ మధ్య మరీ ఘాటుగా ఉంటోంది. రచయితలుకవులమీద, కళాకారులమీద విడవకుండా దాడిచేస్తున్నారు. ఎవర్నో ఒకర్ని విమర్శిస్తేగాని "హాస్యం" పుట్టదని మీనమ్మకమా?

ఎస్. సూర్నాథరావు (గుంటూరు)

*　*　*

## బొమ్మలకథ

కొన్ని విదేశీ పత్రికలలో— ట్రూరోమాన్సు, ట్రూ స్టోరీ వగైరా—వేసే ప్రేమకథలులాగా ంది 'డాక్టర్‌రాజా' బొమ్మలకథ! ఇటువంటి థలమూలంగా 'పవిత్రప్రేమ', త్యాగం, వంటి ర్థంలేని భావాలు ప్రజలలో—కనీసం కొందరిలో ఏర్పడుతున్నాయి. ఇటో, అటో తేల్చుకోకుండా ఊరికే ప్రేమ, అంటూ విలపించటం ఈ రకం 'సాహిత్యం' లో పాత్రలకలవాటైపోయింది. పెళ్ళి చేసుకోకుండా సుష్టుంగా రెండుపూటలా భోజనం చేస్తూ తిరగడం త్యాగం! తెరమీద కాగితంమీద ఈజాతి సాహిత్యం అధికమవుతోంది. ఇది ఒకరకం దుశ్శకునం.

కె. వి. ప్రేమలత (మద్రాసు)

*　*　*

## సీరియల్ కథలు

కవి సార్వభౌముడు నవల శైలి చక్కగా ఉన్నది. కథాగమనముకూడా అనుకున్నదాని కంటే చురుకుగా సాగుతున్నది. అయితే శ్రీ నాథుడి పాత్రకొన్ని సందేహాలు కలిగిస్తున్నదని చెప్పాలి. కవిసార్వభౌముడు డిండిముని జయించేందుకు అన్ని 'తంత్రాలు పన్నవలసిన అవసరం ఏమిటి?' నేరుగా వెళ్లి వాదించకుండా ఈఅడ్డదార్లు దేనికి.

అంతేకాదు: మల్లయుద్ధం విషయంలో కైతం శ్రీ నాథుడే అందరికన్నా ఎక్కువ తెలిసినవాడా! కవిత్వం చెప్పుకుని దర్జాగా బ్రతికాలనుకున్న పెద్దమనిషిని మరొక చాణుక్యునిగానో, 'షెర్లక్ హోమ్స్'గానో మార్చడం నాకు నచ్చలేదు!

పి. వి. రెడ్డి (అనంతపురం)

*　*　*

'పెనుకొండలు' సీరియల్ చదవటానికి చాలా బాగుంది. పాత్రపోషణ చాలా ఉదాత్తంగా జరుగుతోందని అనటానికి సందేహం అక్కర్లేదు. కాని దైవభక్తితోబాటు ధనభక్తికూడా ఎక్కువగా కనిపిస్తోందని చెప్పటానికి విచారిస్తున్నాను!

వి. ఎస్. పి. వల్లి (రాజంపేట)

*　*

## కథలు

'గూడుకోసం గువ్వలు' చదివినతర్వాత చాలా బాధపడ్డాను. తాతత్యాగం అభినందనీయమే అయినా మనవడిని ప్రభుత్వానికి అప్పచెప్పటం బావుందా? తిండిదొరకక జైలుకెళ్లినట్లుంది! అల్లుడి బాధపడలేనివాడు ఇంకో వూరికి బదిలీ అయినా బావుండేదేమో!

ఎస్. పారంగపాణి (చిత్తూరు)

*　*　*

"గూడుకోసం గువ్వలు" కథ చదువుతున్నంతసేపు ఇంకా చదవాలనిపిస్తున్నది. ఇది చదివిన తర్వాత నాకు నిజమనిపించింది. ఇది జరిగిన విషయమేనా?

గాయత్రి (సిద్ధుగారిపల్లె)

*　*　*

"వానకురిసింది" అను కథ చాలా సహజంగా మధురమైన మామిడిపండులా ఉన్నది. ప్రొఫెసర్, వారుల సంభాషణ అంతా కెమిస్ట్రీ! అంతగా రుచించుటలేదు. కథచదివి శ్రీ విజయ గారు కెమిస్ట్రీ సబ్జెక్టుకు సంబంధించిన వారని ఊహించుచున్నాను. నాఊహ నిజమేనా?

అయిఉండవచ్చు

టి. పాకయ్య (హైదరాబాదు)

*　*　*

భార్యా భర్తల మధ్య, అత్తాకోడళ్లమధ్య, ఇంకా చాలామందిమధ్యపోట్లాటలు, అరుపులు సాధింపులు, కేకలు రోజూకాకపోయినా తరచూ చూస్తుంటాం. సినిమాలలో చెప్పనే అక్కర్లేదు. ఎంత గట్టిగా అరిచిమాట్లాడితే అంతమంచి నటుడు. కనుబొమలెగరేస్తే అమోఘమైన నటన! పవిత్రాలోకం వ్యాసాలు చాలామట్టుకు ఇంతే. ఇక కథలుకూడా మారేందుకు సిద్ధంగా ఉన్నాయని 'గాలివాన' కథ చదివి భయపడ్డాను. ఈ వాన పాఠకజనంపై దయఉంచి కీచులాటలు కథా వస్తువుగా అవకుండా చూడండి!

పి. వి. రాజా (విజయనగరం)

*　*　*

9—3—62 పత్రికలోని 'యుగధర్మం' కథలోకాత్యాయని రమణారావుతో లేచిపోవడాన్ని 'యుగధర్మం' పేరట 'హసీన్' గారు సమర్థించారు. యువ్వనా వేశంలోచేసే అర్థంలేని పనుల్ని అభ్యుదయం పేరిట సమర్థించడం క్షంతవ్యంకాదు. జాతి సంప్రదాయాలనీ, సంస్కృతినీ సాహిత్యం ద్వారా పెంపొందింపజేయాలి. అదే సాహిత్య ప్రయోజనము. సంస్కృతి సంప్రదాయాలకి ముప్పుదెచ్చే కార్యాల్ని 'యుగధర్మం' అని ఎలా సమర్థించ గలుగుతాము? కథకుడు నా అభిప్రాయాన్ని అర్థం చేసికొంటారనుకొంటాను.

చక్రవర్తి పి. యస్ వేణుగోపాల్ (అనంతపురం)

★

6-4-'62 సంచిక శుభకృత్ ఉగాది ప్రత్యేకసంచికగా వెలువడుతుంది. వివరాలు పై సంచికలో.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు


## విషయానుక్రమణిక


శుక్రవారం 16-3-62
ప్లవసం॥ ఫాల్గునమా॥ శు॥ఏకాదశి
సంపుటము : 54 సంచిక : 28

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1


★




కథలు



శీర్షికలు



## లోకంపోకడ



"ఇప్పుడు మీరు పార్లమెంటు సభ్యుడు అయ్యారు బాగానే ఉందిగాని, మంత్రి అయ్యేవరకు నాకు తృప్తి ఉండదు."


పోటీలేకుండా ఎన్నిక!


ఆటలో అరటి పండు
ఎన్నికల యుద్ధానంతరం కృష్ణమీనన్ కృపలానీని కలుసుకున్నారు.


బర్మాలో ఏం జరిగితే నేంకనక. మనకు అనుకూలంగా మాత్రం లేదు
'బర్మా వార్తలు'


ప్రధాని ఎదుర్కొంటున్న సమస్యలు
రాష్ట్రాలలో పార్టీ నాయకుల ఎన్నిక
మధ్యప్రదేశ్, రాజస్థాన్‌ల వ్యవహారం
కాంగ్రెస్‌పార్టీకి పునరుజ్జీవనం
కాంగ్రెస్ పార్టీకి కొత్త అధ్యక్షుడు



ఢిల్లీలో జరిగిన సమాచార స్వేచ్ఛా సదస్సు ముగింపు సమావేశంలో ప్రసంగించడానికి వచ్చిన శ్రీ నెహ్రూ; ఇతరప్రముఖులు.

# అధికారం చవిచూచిన ఢిల్లీనాయకుల ఎత్తు: వైద్యుల ప్రకటనకు అధికారుల సవరణ!

శ్రీ కృష్ణ

ఢిల్లీ నగరపాలక సంఘ పరిపాలనా బాధ్యతను కాంగ్రెసు పార్టీకి అప్పగించి, లోక్‌సభలో ఈ నగరానికి గల స్థానాలకు కాంగ్రెసు అభ్యర్థులనే గెలిపించి, పురజనులు ప్రధానమంత్రి యందు తమకు గల ప్రగాఢమైన విశ్వాసాన్ని వెల్లడించారు. నగర పాలక సంఘంలో ఉన్న మొత్తం 80 స్థానాలలో కాంగ్రెసుపార్టీ 64 స్థానాలు గెలుచుకుని, జనసంఘం, కమ్యూనిస్టు పార్టీలపై దెబ్బతీసింది. జనసంఘం తొమ్మిది స్థానాలు, కమ్యూనిస్టు పార్టీ రెండు స్థానాలు మాత్రమే దక్కించుకోగలిగాయి. మిగతా ఐదు స్థానాలకు ఇన్‌డిపెండెంట్ అభ్యర్థులు ఎన్నికయ్యారు. వెనుకటి అనుభవాన్ని పురస్కరించుకుని ఇన్‌డిపెండెంట్ అభ్యర్థులు సర్వసాధారణంగా అధికార పక్షంలో విలీనం అయిపోతారని ఆశించవచ్చు. కాంగ్రెసుపార్టీ ఢిల్లీలో ఇంత ఘనమైన విజయం సాధించగలిగి ఉండేదని కాంగ్రెసు నాయకులు కలలో కూడా అనుకొని ఉండరు!

ఈ ఎన్నికలు కాంగ్రెసు పార్టీకే కాక, ఢిల్లీ నగరానికి కూడా ప్రయోజనకరంగా పరిణమించగలవో లేదో చూడవలసి ఉన్నది. నగర పాలక సంఘంలో ఏ పార్టీకీ స్పష్టమైన మెజారిటీ లేక ఇంతవరకు పరిస్థితులు అస్తవ్యస్థంగా ఉండేవి. కాంగ్రెసుపార్టీయందు ఇప్పుడు ప్రజలు చూపిన అభిమానాన్ని ఆ పార్టీ ఎంతవరకు సద్వినియోగం చేసుకుంటుందో చూడాలి.

లోక్‌సభకు ఎన్నికైన ఐదుగురు సభ్యులలో, శ్రీయుతులు చౌదరి బ్రహ్మప్రకాష్, నవల్ ప్రభాకర్ పాత వారే. శ్రీ మెహర్‌చంద్ ఖన్నా 1947 నుంచి పార్లమెంటు సభ్యుడుగానే ఉన్నా, ఇంతకు మునుపు ఎన్నడూ లోక్‌సభలో ఢిల్లీ ప్రతినిధిగా వ్యవహరించలేదు. ఇప్పటి మంత్రివర్గంలో ఆయన పునరావాస శాఖ మంత్రిగా ఉన్నారు. ఇప్పుడు కొత్తగా లోక్‌సభకు ఎన్నికైనవారు శ్రీయుతులు లాలాశ్యామ్‌నాధ్, శివచరణ్ గుప్త. వీరు ఇంతకుమునుపు నగర పాలక సంఘ సభ్యులు.

ప్రస్తుత లోక్‌సభలో ఢిల్లీ ప్రతినిధులు నిర్వహించిన పాత్ర అంత ప్రోత్సాహకరమైనదిగా లేదు. ఒక జిల్లా విస్తీర్ణత అయినా లేని ఢిల్లీలో ఏదోవిధంగా పార్లమెంటరీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయించటమే శ్రీబ్రహ్మప్రకాష్‌కు ఏకైక లక్ష్యంగా ఉండేది. శ్రీ రాధారవన్ ఢిల్లీకి సంబంధించిన వ్యవహారాలు పట్టించుకోక ప్రధాన మంత్రి దృష్టిలో పడేందుకు అడ్డమైన ప్రతి ఇతర వ్యవహారంలోను ఉత్సాహం చూపేవారు. మలబారీ పెద్దమనిషి శ్రీ కృష్ణనాయర్ తామరాకుమీద నీటిబొట్టు వలెగా అంటీ ముట్టనట్టుగా వ్యవహరించేవారు. వీరంతా "మనకెందుకులే" అన్న విధానాన్ని అనుసరించేవారు — అంటే ఆఖరికి ప్రశ్నలన్నా వేసి మంత్రివర్గాన్ని ఇబ్బంది పెట్టేవారు కారన్నమాట. ఇక పోతే కమ్యూనిస్టులు, జనసంఘీయులు, ఇన్‌డిపెండెంట్ సభ్యులు నగర సంక్షేమం కోసం పాటుపడ్డారు.

శ్రీ చౌదరి బ్రహ్మప్రకాష్ తాము అఖిలభారత నాయకులమని భావిస్తారు. కనుక ఢిల్లీ నగర వ్యవహారాలు పట్టించుకోటం వారి ప్రతిష్ఠకు భంగం. ఢిల్లీకి పార్లమెంటరీ ప్రభుత్వం ఏర్పాటు చెయ్యాలని పట్టు పట్టి ఇప్పుడు కాంగ్రెసు సాధించిన అఖండ విజయాన్ని సార్థక పరుచుకోవాలని వారు యోచిస్తున్నట్లు తెలుస్తున్నది.

శ్రీ శ్యామ్‌నాథ్ ఎన్నికలు జరుగకమునుపు నుంచి కూడా మంత్రిపదవి అలంకరించినట్లు పగటి

—62 వ పేజీ చూడండి

# సుగుణ హృదయం

నూజివీటి



స్కూల్లో గంట గణగణ లాడింది పిల్లలూ, మేష్టర్లూ ఎవరి రూములకువాళ్ళు పోతున్నారు అప్పుడే రిక్షా దిగిన సుగుణ గమ్మున హెడ్మాష్టరు రూములోకి వెళ్లి సంతకం చేసి, సైన్సు లేబ రేటరీ వైపు చకచకా వెళ్లిపోయింది ఆమె వెనకే —క్లాసు పిల్లలు కికకికలతో వచ్చారు అంతకు ముందే ఆటెండరు పరికరాలన్నీ సరిచేసి ఉంచడం వల్ల సుగుణ — అటెండెన్సువేసి, పాఠం ప్రారంభించింది. పాఠం ఓ పది నిముషాలు సాగేసరికల్లా ఒక ఆరేళ్ల పిల్ల ఏడుస్తూ లోపలకు వచ్చింది. వస్తూనే 'మరేం నాన్నా" అంటూ మళ్లీ ఏడువు ప్రారంభించింది శ్రోతలు చూపరు అయ్యారు. సుగుణ గమ్మున కుర్చీలోంచి లేచి, ఆ పిల్లకు ఎదురు వెళ్లి "ఏం—ఉషా—ఏవయ్యిం దమ్మా" అంటూ ఎత్తుకుని, టేబులుమీద కూర్చోపెట్టింది. ఉష ఏడువు మానలేదు కాని శృతి తగ్గించి "మరేం — నాన్న కావాలి" అంది కళ్ళు నలుపుకుంటూ

"మీ నాన్నగారేనా — వస్తారమ్మా — క్లాసుకి వెళ్లారు. అలా బుద్ధిగా కూర్చో" అంది ఆమె. కానీ, ఉష అలా కాదు ఎలాగా కూర్చోదల్చుకో లేదు. టేబులుమీంచి కిందికి దిగుతూ "ఊ ఇప్పుడే కావాలి" అంది.

"ఎందుకూ" అంది సుగుణ ఏవనాలో తెలీక

"మరేం — మా అమ్మ లేదని, నన్ను మా క్లాసు వాళ్ళు జట్టులో ఉండనివ్వలేదు. అందుకని, నాకు అమ్మ కావాలి" అంది ఏడుపుమాని. సుగుణ ఖుర్ర కొట్కుంది. ఏవని సమాధానం చెప్పాలో తెలీక ఆనక, "మీ అమ్మగారేనా, వస్తారమ్మా— నువ్వు ఎంచక్కా చదువుకుని, నా అంతదానివి అయ్యే సరికి వస్తారు—ఏం? — ఏదీ మరి నువ్వు" అంది ఆ మాటలకు ఉష నవ్వేకన్నా ముందు మిగతా పిల్లలు నవ్వేరు సుగుణ చర్రున వాళ్లకేసి చూసి, మళ్లీ ఉషవేపు చూస్తూ "ఏదీ నవ్వమ్మా బంగారు తల్లిలా నవ్వాలి మరి" అంది ఉష కన్నీటి కళ్ళు తళతళ మెరిశాయి "నిజంగానా" అంది "అవునమ్మా" అంది సుగుణ ఉష కళ్ళు తుడిచేసుకుని, "మా పిన్ని మంచిది" అంటూ సుగుణ బుగ్గమీద ముద్దు పెట్టుకుని, పరిగెట్టుకుంటూ వెళ్లిపోయింది. ఆమె వెళ్లిన వైపు చూసి, సుగుణ చిన్నగా నిట్టూర్చింది

"ఎవరు మేడమ్" అంది గుంపులోంచి ఒక గాజుల కంఠం

"రాజారావు మేష్టారి కూతురోయబ్బ" అంది మరో కంఠం

"అవునట — ఆయన భా "

"సరిసరి . పాఠంలోకి రండి" అంది సుగుణ కంఠం దాంతో సద్దు మణగిపోయింది మరి కాస్సేపటితో గంట అయిపోయింది క్లాసు పిల్లలు వెళ్లిపోయారు రాజారావు కూతురితో సహా వచ్చి తన కుర్చీలో కూర్చున్నాడు సుగుణ ప్రయోగం చేసి చూపిన పరికరాలన్నీ సద్ది, తన కుర్చీలో కూర్చుంది ఉష తండ్రి దగ్గర నుంచి లేచి, సుగుణ వద్దకు వెళ్లింది. రాజారావు కూతురుకేసి చూసి చిన్నగా నవ్వుతూ "మీరు దీనికి బాగా చనువై పోయారు. పాపం — మీ ప్రాణం కొరుక్కు తింటోంది ఇందాక — క్లాసు మధ్యలో వచ్చి మారాం చేసిందట కదూ" అన్నాడు సుగు ముద్దేశించి సుగుణ సమాధానంగా చిన్నగా నవ్వి వూరుకుంది.

* * *

కాలచక్రం మరో రెండు మూడు వారాలు తిరిగి, ఓ ఆదివారం దగ్గరకొచ్చి కాస్సేపాగింది. సాయంత్రం అవడంవల్ల సుగుణ ఇంటిముందు వాకిట్లో కుర్చీలో కూర్చుని ఉషా — తన చెల్లెలు రాధ ఆడుకునే ఆటలు చూడసాగింది

ఉషా, రాధా కాస్సేపు, తొక్కుడుబిళ్ల ఆడారు. తర్వాత—నేలా బండా, తుబెండుతె బెండూ, వానా టప్పాలాటి ఆటలు చాలా ఆడి, విసుగుచెందారు

"చఫ్ — ఈ పాడాటలొద్దోయబ్బా" అంది రాధ జుట్టు వెనక్కు తోసుకుంటూ

"అయితే మరే వాడదాం" అంది ఉష

రాధ ఒక్క నిముషం బుగ్గన వేలుపెట్టుకుని ఆలోచించి, "ఆ తోచింది నాకు—మరేం—దొంగాట ఆడదాం—ఏం" అంది రాధ ఆమె చెయ్యి పట్టుకుని, ఆట నియమాలు చెపుతూ "ఇది—మా అక్క అమ్మట—ఏం—దొంగ ముట్టుకునేలోగా—అమ్మని తాకితే — ఇంక — అవుటు లేదన్నమాట" అంది చేతులు ఎగరేసి, ఉష వైపు చూస్తూ. కానీ ఉష ఆటవిషయం వినడంలేదు అమ్మమాట విన బడ్డంతోనే, ఆమె కళ్లల్లో నీరు తిరిగింది అది గ్రహించిన రాధ "ఔను కదూ — నీ కమ్మ లేదుగా — అందుకని ఏడుస్తున్నావా" అంది ఆపని చేయబోతున్న ఉష, ఆ మాటతో అంతపనీ




చేసింది పిల్లల ఆటమీదుగా, ఊహాలోకంలోకి వెళ్ళిన సుగుణ ఉష ఏడుపుతో తిరిగొచ్చి "ఏం ఉషా—ఏవయ్యిందమ్మా—పద్మావా—ఏవే రాధా—ఏం? మాట్లాడవే — బెల్లం మొత్తిన రాయిలా—అంటూ గదమాయించింది రాధ ఆ మాటలకు బుగ్గలు నొక్కుకుంటూ "నేనేవన్నానమ్మా — "అమ్మ లేదంటే ఏడుస్తోంది" అని, అక్క పెట్ట బోయేవి అందకుండా పరిగెట్టుకెళ్ళిపోయింది బెళ్లెలిమీద అరుపు మాని, సుగుణ ఉషని సముదా యించబోయింది

"నేను వస్వను. నా కమ్మకావాలి" అంది ఉష స్థిరంగా

"వస్తారు అదే మరి — అలా ఏడుస్తే రారు." ఉష ఈసారి యిలాటి మాటలు వినదల్చుకో లేదు. మాటలవల్ల పని జరగదని గ్రహించి "పిల్లేదు మా అమ్మ రావాలి. లేకపోతే నేనూ మా అమ్మ దగ్గరికి పోతా" అంటూ అరిచింది. సుగుణ ఉలిక్కిపడి, "ఛఛ్", తప్పమ్మా అలా అనకూడదు" అంది ఇంతలో బయటనుంచి రాజారావు వచ్చాడు అతన్ని చూసి సుగుణ లేచి నుంచుంది

"ఎప్పుడు చూసినా, మీతో గారం తప్ప దీనికేం పని లేనట్టుందే" అంటూ రాజారావు కూతురి వంకచూసి, "ఏం తల్లీ ఏం కావాలి" అన్నాడు

"అమ్మ" అంది ఉష స్థిమితంగా

రాజారావు ముఖం మండిన బల్బులా, కాంతి హీనం అయిపోయింది ఉవ్వెత్తున ఉన్న హుషారు చచ్చిపోయింది మనిషి వాడిపోయిన తోటకూర కాడలా వాలిపోయి, కూతుర్ని ఎత్తుకుని "అమ్మ వస్తుందమ్మా" అని గొణుక్కుంటూ లోపలకు, వెళ్ళిపోయాడు. సుగుణ చిన్నగా నిట్టూర్చి లోప లకు వెళ్ళింది.

* * *

ఆ రాత్రి సుగుణ తల్లి రత్నమ్మగారు భోజనా లయ్యాక లోకాభిరామాయణం ప్రారంభించి, అటు నుంచి రాజారావు సంసారం మీదికి మారింది

"ఏం జీవితాలో తల్లీ—ఏ క్షణమూ మనది కాదు పక్కవాటా వాళ్లు లేరూ. అతను—అతనే —రాజారావు పాపం ఊఊ రతనికి బదిలీ — అయ్యిందట ఇంకో వారానికి యీ ఊరు రావా లనంగా—ఆరోజ రాత్రి దీపం వెలిగించి, [illegible] తుడుస్తోందట అతని పెళ్ళాం—అంతే—[illegible]

—౭౭ వ పేజీ చూడండి

# కథ కాని కథ

## సెలవు దరఖాస్తు
### (మొదటి బహుమతి)

అయిదు సంవత్సరముల క్రిందటి విషయమిది. అప్పుడు మా చెల్లి అయిదవతరగతి చదువుతుండేది. వాళ్ళ క్లాసుటీచరు నాస్నేహితుడే. ఒకరోజున నాకు కనబడి వాళ్ళింటికి తీసుకెళ్ళాడు. నన్నుకూర్చోబెట్టి, పుస్తకాలన్నీ వెదికి మాచెల్లి తెలుగు కాంపోజిషన్ పుస్తకం తీశాడు. తెలుగులో "సెలవు దరఖాస్తు"మీద కాంపోజిషన్ వ్రాయమన్నారట. మాచెల్లి వ్రాసిందిది.

"ఘనమైన క్లాసుటీచరుగారికి, తమ శిష్యురాలు వ్రాసుకొనే సెలవు దరఖాస్తు విన్నపములు.

అయ్యా! నాకుతలనొప్పి, జ్వరముగానున్నది. కాబట్టి ఈరోజు సెలవు ఇప్పించవలసినదిగా కోరుచున్నాను.

అమ్మ, నాన్నగార్లు క్షేమము. ఇంతేసంగతులు. చిత్తగించవలెను.

జానకి (వైజాగ్)

## పొదుపరి
### (రెండవ బహుమతి)

ఒకరోజున నేను నా స్నేహితుడు కుమార్ కలసి మా పట్టణములోని చిన్న హోటల్ కు వెళ్ళితిమి. మేము ఒకరి ప్రక్క ఒకరు కూర్చుంటిమి. ఇంతలో మా ఎదురుగా ఒక ఆసామి వచ్చి కూర్చుండెను. హోటల్ సర్వర్ వచ్చి "ఏమి కావలెన"ని అడిగెను. మా ఎదురుగా కూర్చుండిన ఆసామి "సింగిల్ ఇడ్లీ" అనెను.

సర్వర్ వచ్చులోపల ఆసామి హోటల్ ప్రొప్రయిటర్ వద్దకు వెళ్ళి దినపత్రిక తెచ్చి చూచుచుండెను. సర్వర్ ఇడ్లీ ప్లేటును తెచ్చి ఆసామి ముందుంచెను. అతడు ఇడ్లీ తినుచు పేపరు చదువుచుండెను. సర్వర్ "ఏమి కావలెన"ని అడిగెను. ఆసామి బిల్లు ఇమ్ము అనెను. సర్వర్ (1/7) ఒకటిపై ఏడు అంకెవేసి బిల్లు యిచ్చెను.

మేము కాఫీ తీసుకొని బిల్లు యిచ్చుటకై ప్రొప్రయిటర్ వద్దకు వచ్చితిమి. మేము బిల్లు చెల్లించుచుండగా ఆ ఆసామికూడ తన బిల్లు యిచ్చి ఏడు నయాపైసలు బిల్లుపై పెట్టెను.

ప్రొప్రయిటర్ అతని ముఖము చూచి నవ్వి ఆసామితో "మీరు రోజు ఏడునయాపైసలు బిల్లు చేయుదురు. కారణమేమిట"ని అడిగెను.

అతడు "నేను హోటల్ కు వచ్చుచున్నది పేపరుకోసము. పేపరు ఏడునయాపైసలు పెట్టికొనేబదులు, ఏడునయాపైసలు పెట్టి ఇడ్లీతిని పేపరుకూడా చదువుచున్నాను. ఏడు నయాపైసలుఆదా"అనిజవాబిచ్చెను.

ప్రతాప రామకృష్ణ (గుంటూరు)

## గురుభక్తి
### (రెండవ బహుమతి)

మా ఊళ్ళో నెలరోజులక్రితం ఒక సంగీతం మాష్టారికి సన్మానంచేశారు. పెద్దలంతా ఆయనను గురించి పొగడుతూ ఏవేవో చెప్తున్నారు. చివర్న ఒక హరిదాసు గారులేచి 'ఈయన నా గురువు'గారంటూ పద్యాలు పాటలూ మొదలెట్టేడు. కొంతసేపటివరకు బాగానేఉన్నా, రానురాను విసుగుపుట్టింది. 'నాచిన్నతనంలో ఓరోజుని ఆపాటచెప్పేరు, ఇంకోరోజుని ఈపాటచెప్పేరు' అంటూ తనకున్న పాండిత్యాన్నంతా వెళ్ళబోస్తున్నాడు. ఇక మానేస్తాడేమో అని మా గ్రూప్ అంతా (పదిమందికిపైగా ఉంటాం) చప్పట్లు కొట్టాం. అవి, తనగాన మాధుర్యానికని పొరబడి ఇంకా చదవడం మొదలుపెట్టేడు. అంతలో ఆయనే టైము చూచుకొని "క్షమించాలి, చాలాటైము తీసుకున్నాను. వీరు నాకునేర్పిన, మరొక పాటపాడి దిగిపోతాను" అన్నాడు. అప్పటికే బాగాబోరైన మా 'బుచ్చి' వెంటనే "అలాగని ఒట్టెయ్యండి" అన్నాడు గట్టిగా. అదివిని జనమంతా గొల్లుమన్నారు.

శ్రీవాత్ (రామచంద్రపురం) ★



ఇటీవల రాజీనామా చేసిన ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం.

# పార్టీనాయకుని ఎన్నికలో అధిష్ఠానవర్గం జోక్యం: దక్షతగల సభాపతి లేకపోతే కల్లోలానికి ఆస్కారం

**కౌండిన్య**

రాష్ట్ర శాసనసభా కాంగ్రెస్‌పార్టీ నాయకత్వం తగాదా, అధిష్ఠానవర్గం, ముఖ్యంగా నెహ్రూ కల్పించుకోడంవల్ల తప్పిపోయింది ముఖ్యమంత్రి శ్రీ సంజీవయ్యను గద్దెదిగి, శ్రీ సంజీవరెడ్డిని ఎక్కమని శ్రీ నెహ్రూ ఆదేశించారు మిగతా రాష్ట్రాలలో గెలిచిన ముఖ్యమంత్రులనెవరినీ మార్చకుండా, మళ్లీ పదవిలో ఉండటానికి అనుమతించిన అధిష్ఠానవర్గం ఒక్క ఆంధ్ర విషయంలోనే అట్టి మార్పు ఎందుకు సంకల్పించాలి పైగా బీహార్, మైసూరులాంటి రాష్ట్రాలలో ప్రజాస్వామ్య ధర్మం ప్రకారం పార్టీ నాయకత్వానికి పోటీ జరపడానికి ఒప్పుకుని, ఆంధ్రలో అటువంటి పోటీ వీలుకాదని చెప్పడం సబబేనా? ఇటువంటి సందేహాలు జన సామాన్యానికి కలగడం సహజం అధిష్ఠానవర్గం వైఖరినిబట్టి ఈ సందేహాలకు సరియైన సమాధానం లభించదు అధిష్ఠానవర్గం ఏమైనా సరే సంజీవరెడ్డి ముఖ్యమంత్రి కావడమే తమ అభీష్టమని మొదట్లోనే చెప్పిఉంటే, బాగుండేది కాని అలా చేయక, అగ్రనాయకులలో ముఖ్యులైన శ్రీ లాల్‌బహదూర్, శ్రీమతి ఇందిరాగాంధీలు సంజీవయ్యను మళ్లీ శాసనసభకు పోటీ చేయమని సలహా ఇచ్చారు వారి పేర్లు ఉదహరిస్తూ, తాను ఏమైనా సరే నాయకత్వానికి పోటీ చేయదలచానని సంజీవయ్య ప్రకటించి ఉన్నారు. ప్రజాస్వామ్య పద్ధతిన ఎన్నిక వ్యవహారం సాగుతుందన్న నమ్మకంతోనే శ్రీ సంజీవయ్య ఆనాటి ప్రకటన చేయడం జరిగింది శ్రీ నెహ్రూ కల్పించుకొంటారని తెలిస్తే, అప్పుడే వెనక్కు తగ్గి ఉండేవారు ఎన్నికల ఫలితాలనుబట్టి సంజీవయ్యకు తగినంత బలం లేదని తేలిపోబట్టే, వెనక్కి తగ్గమన్నారు, అని కొందరు వాదించవచ్చు ఎవరికి ఎంత బలం ఉందో తేల్చే ప్రయత్నమే జరగనప్పుడు ఈ వాదంతో పసలేదు అదీగాక బలం లేదని తెలిసి కూడ పూర్వం గోపాలరెడ్డి పోటీకి నిలవలేదా? ఏమైనా శ్రీ నెహ్రూ ఆదేశాన్ని శిరసావహించి పోటీ సంకల్పాన్ని మానుకుని శ్రీ సంజీవయ్య తన సహృదయతను, క్రమశిక్షణను నిరూపించుకున్నారు.

ఇంతకూ శ్రీ సంజీవరెడ్డే ముఖ్యమంత్రి కావాలని అధిష్ఠానవర్గం ఎందుకు నిర్ణయించాల్సి వచ్చింది అంటే అందుకు బహు కారణాలున్నాయి ఒకటి:—శ్రీ సంజీవరెడ్డి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ఆ పదవినుంచి తప్పించి, కాంగ్రెస్ అధ్యక్ష పదవి స్వీకరించేట్లు చేశాము కనుక, కాంగ్రెస్ అధ్యక్ష పదవి వదలిపోయేటప్పుడు తిరిగి ముఖ్యమంత్రి పదవి ఇప్పించడం తమ బాధ్యత అని అధిష్ఠానవర్గం భావించింది రెండు:—గత రెండు సంవత్సరాల అనుభవాన్నిబట్టి శ్రీ సంజీవరెడ్డిని కాదని, సంజీవయ్యనే ముఖ్యమంత్రిగా ఉండనిస్తే గ్రూపు రాజకీయాలు మరింత పెచ్చరిల్లుతవేగాని, సమసిపోవడం అసంభవమని అధిష్ఠానవర్గం అభిప్రాయపడింది. మూడు:—ఈ ఎన్నికలలో కాంగ్రెస్ దెబ్బతిని మెజారిటీ తగ్గిపోయిన పరిస్థితిలో ముఠా రాజకీయాలను చెలరేగనివ్వటం శ్రేయస్కరంకాదని, శ్రీ సంజీవరెడ్డి ప్రభుత్వంలోకి వస్తే ముఠాలు ఉండవు గాబట్టి సంజీవయ్యకు నచ్చచెప్పి ముఖ్యమంత్రి పదవి, శ్రీ రెడ్డికి ఇవ్వాలని నిర్ణయించింది అధిష్ఠానవర్గం అభిప్రాయాలు ఎంతవరకు సమంజసమైనవీ ఉత్తరోత్తరా జరిగే పరిణామాలనుబట్టి బుజువౌతుంది

అధిష్ఠానవర్గం ఆశీర్వాదంముతో శ్రీ సంజీవరెడ్డి ముఖ్యమంత్రిపదవి చేపట్టారు శ్రీరెడ్డి గట్టివాడునమర్థుడు. అయితే ఆయన తిరిగి ప్రభుత్వంలోకిరాగానే ముఠాలు అంతరించిపోతాయా అన్నది సందేహం. కాంగ్రెస్ ఉన్నంతకాలం ముఠాలనేవి ఉంటూనే ఉంటవి శ్రీరెడ్డి లోగడ ముఖ్యమంత్రిగా ఉండగా, ఈ ముఠా మనస్తత్వాలు తలయెత్తలేదా? కాకపోతే ఆనాడు కాంగ్రెస్ బలం అప్రతిహతంగా ఉండటంచేత, ముఠాలను కలుపుకు రాకుండా, కొట్టి పారేసి వారందరిని సంస్థనుండి బయటకు నడిపినా చెల్లిపోయింది అప్పటికైనా బాహాటంగా తలఎత్తిన ముఠాలు బయటికి పోయాయి ప్రచ్ఛన్నంగా ఉన్నవి సంజీవరెడ్డి పదవి వదలడంతో పైకి లేచాయి మరి ఈసారి గ్రూపులను పూర్తిగా తుడిచివేయడానికి శ్రీ సంజీవరెడ్డి సాహసించగలరా? అటువంటి సాహసం చేస్తే సంస్థకే దెబ్బ కనుక గ్రూపులను కలుపుకుపోయే విధంగా వ్యవహరించడం వినా మరో గత్యంతరం లేదు.

63-వ పేజీ చూడండి

# ఈవారం సినీవిహారం

మధుమూర్తి



మయూర్ ప్రొడక్షన్స్ వారి 'ప్రాణస్నేహితులు' లో కృష్ణకుమారి, కాంతారావు.

## సతీపతుల కుతూహలం

రామభద్రయ్యగారికి కొడుకు లిద్దరు. వారిపేర్లు అంజి, రాజా. గుండమ్మకి కూతుళ్లిద్దరు ఐతే ఒకామె సవతి కూతురు. చిన్నారి చిట్టి తల్లి సరోజ స్వంత కూతురు. సహజంగా గుండమ్మకి స్వంతబిడ్డపైనే వాత్సల్యాన్ని చూపిస్తూండడం అల వాటు. అంచేత ఆ ముద్దుబిడ్డ కొంచెం తల బిరుసును పెంచుకుంది. సవతి కూతురు సహజంగా సుగుణాల రాశిగా పెరుగుతుంది.

అంజి లక్ష్మిని, రాజా సరోజను పెళ్లి చేసుకోవాలని పథకం వేశారు. విజయు లయారు. అంతటితో వారి కార్యక్రమం పూర్తికాలేదు. వారి పెళ్లిళ్లు ఎంత తమాషాగా సాగుతవో అంత విడ్డూరంగానూ వారు తలపెట్టిన "వ్యక్తుల" సంస్కరణ కూడా సాగుతుంది

లక్ష్మికి తాను రామభద్రయ్యగారి కోడ లయ్యాననే వార్త ఆమె ఆ యింట్లో పాదం పెట్టే వరకూ తెలియదు లక్ష్మి మంచితనం గ్రహించిన రామభద్రయ్యగారు ఇంటి పెత్తనం అంతా ఆమె చేతుల్లోనే పెట్టాడు రాజా తన భార్యను ఇంకా తనింటికి తీసుకురాలేదు



విజయా వారి 'గుండమ్మకథ' లో
ఎన్. టి. రామారావు.

అప్పుడే ఇంటి నౌకరు వెంకన్న కొంత డబ్బు పట్టుకువచ్చి లక్ష్మి కిచ్చాడు. ఆమె సొమ్ము తీసుకుని లోపలికి వెళ్లిందో లేదో భర్త అంజి హాలులోంచి "బుల్లెమ్మా! బుల్లెమ్మా" అని పెడ బొబ్బలు పెట్టాడు

50—వ పేజీ చూడండి



విక్రమ్ ప్రొడక్షన్స్ వారి
'పెళ్ళితాంబూలం'లో జమున.



బాబూమూవీస్ వారి 'మంచిమనసులు'లో
నర్తకి జ్యోతి.

# హరివంశము

హారీత శివశర్మ

## సాందీపనిపర్వం - 52

మహానందు డిప్పుడు ఇరుకునపడినాడు. అతని కేమో సువర్ణముపై కాంక్ష లేదు. భార్యకు ఆకాంక్ష ఇప్పుడు మిక్కుటమైనది. శౌండ్రకుని వివాహము, పట్టాభిషేకము పూర్తియయి, సాందీపనియు, ఆయన కుటుంబమును, తానును, తనకుటుంబమును ఆశ్రమమునకు వచ్చినారన్న మాటేగాని, అతనికి శాంతియన్నది లేకుండ పోయినది. నిజముగా అతనిలో శాంతియన్నది లేకుండ పోయినదా! బయటికి అత డట్లులే కన్పించుచుండెను. ఒక్కచోటనున్నవాడు ఒక్కచోటనుండక, ఒక్కచోటతిరిగినవాడు ఒక్కచోట తిరగక, కాళికయుంతయు గ్రుమ్మరుచు, ఇంటి పట్టునకు వచ్చుటయే మానివేసెను. ఎప్పుడైన నింటికి వచ్చునో, భార్యతో మాటలాడడు. మాటలాడెనో, కసిరినట్లు మాట్లాడును. ఆమె మరియు కసరును. ఆచార్యాణి కల్పించుకొని "ఓరి మహానందుడా! నీవని మరియు ఆగడముగనున్నది. పూర్వమే నీవు తిరుగుబోతువు ఇప్పుడు మరియు తిరుగుబోతువైనావు. పైగా వదరుబోతువుగూడ నైనావు. దానిని అట్లు ఏలమరా వేపుకొనితిందువు. శౌండ్రకుడిత్తునన్న ఆ బంగారమును పుచ్చుకొన్నచో దోషమా! అది దానిని తన కొరకడుగుచున్నదా! నీ సంసారము ఇప్పుడైనను బాగుపడునని అడుగుచున్నది!" అని మహానందుని కసరును. విచిత్రమేమనగా, ఆమె అట్లు కసరినను, మందలించినను మహానందు డామెను తిరిగి మాట యనడు. ఊరకే నగలబడి నవ్వును. "ఆచార్యాణీ! నీకుగూడ బంగారముపై మమకారము బలిసినట్టులున్నది. నాకువద్దు అనుచుండగా మీరు నన్నేల బలవంతము చేసెదరు. నేను విద్యను అమ్మను. ఆత్మను అమ్ముకొందునుగాని విద్యను అమ్మను. కావలయునో దానిని తీసుకొమ్మనుము. నేను వద్దన్నానా! నేను నాకు వద్దన్నాను. నీవును, అదియును కలిసి ఆ బంగారమును పుచ్చుకొనుడు. సాందీపనియు సంతోషించును" అనును. ఆచార్యాణి "చెప్పినమాట వినవుగదా!" అని మందహాసము చేయును.

ఇట్టి అతనిక అశాంతి యెక్కడిది! అయినను అతడు అశాంతిని పొందుచుండెను. ఆ అశాంతి ఎచ్చటనుండి పుట్టుచున్నది! అది అతనిలో నున్నదా? ఉన్నట్లు, పైకి, చూచుచున్నవారికి కన్పించుచున్నదా! భార్య తనతో పోరాటములాడినప్పుడుగూడ మహానందుడు నవ్వును. నవ్వుచు ఆమె కసరును. "నిన్ను చేసుకొనినాను. నేను నాశనమైనాను" అనును. "నీలో నేను అన్నది ఒకటి యున్నగదా నాశనమగుటకు? నిమ్ములను పెండ్లియాడి నేను నాశనమైనాను" అని అతని భార్య అనును. "నష్టములేదు. ఇప్పుడు ఇంకొక భర్తను చూచుకొనవచ్చును" అని అతడు అనును. ఆమె పోయి ఆచార్యాణిని పిల్చుకొనివచ్చి "చూడు! వదినా! ఈయన ఏమనుచున్నారో"! అనును. 'ఏమిరా! ఏమనుచున్నావు" అని ఆమె ప్రశ్నించును. "నేను ఏమి అన్నాను. నన్ను పెండ్లియై తాను నాశనమైతినని ఆది అనగా, ఇంకొకరిని పెండ్లియాడి, తిరిగి బ్రతుకమన్నాను." అని అతడు ప్రత్యుత్తరించును. ఆచార్యాణి నవ్వును. నవ్వుచు మందలించును. "మహానందా! నేను చెప్పుచున్నాను. ఆ బంగారము కావలయునన్నదని దాని నింతగా ఆరడిపెట్టుచున్నావు. ఆ శౌండ్రకు డెట్లును, ఆ సువర్ణపు మృగమును తెచ్చి ఇచ్చును. వాడు అట్టిడు. అప్పుడు నీవు ఏమి చేసెదవు. దీని నిట్లు కొరుకుకు తినక,ఆ మృగమునుపుచ్చుకొన్న నేమగునురా"!అనును. "ఏమగునా! నా తపస్సంతయు వ్యర్థమగును. నేను వ్యర్థుడనగుదును." అని మహానందుడనును. అతడు ఆ మాట అనగా భార్య నగలబడి నవ్వి "ఇప్పుడు మనము వ్యర్థులము కానట్లు" అనును. "ఆచార్యాణీ! నేను దీనిని ఆమాట అన్నానని మీరు వచ్చినారు. ఇప్పుడు ఏమందురు?" అని ప్రశ్నించును. ఆచార్యాణి నవ్వును.

ఇట్టి అల్ప కలహములతోడనే మహానందుడు చీకున పడుచుండును. నిజముగా తా నా బంగారు మృగమును స్వీకరింపవలయు స్థితి ఏర్పడునో! అతనికి అదియే బాధయైపోయెను. అతడు ఆలోచించును. నేను ఇంతవట్టు అంటయు ముట్టనన్ను ప్రలోభిస ఇప్పుడును అట్లు బ్రతుకుదునా! ఒక్క కాంతతో నాజీవితమింత ఆరడియైపోయినది. మరి ఈ బంగారమును ముట్టుదునో! వేరు ఏమైపోదును అనుకొనును. మరియు నొకప్పుడిట్టులనుకొనును. ఈ నేను అనుకొనుచున్న నేను నేనా! నేనును, నేనును వేరైనచో, ఎవ్వరు ఈ బంగారమును ముట్టినట్లు! బంగారమునుతెచ్చి, దానికి ఇత్తునో, అది సుఖపడునా! సుఖము ఎచ్చట నున్నది! శాంతము నం దున్నది. మరి శాంతి యెచ్చటనున్నది. నాలో నున్నదా! పుట్టుకయే శాంతికి విరోధము. మరి పుట్టినవారిలో శాంతి ఎచ్చట నుండును. పుట్టకనే యుండవలెను! పుట్టినచో, అశాంతిని అనుభవించవలె. ఆ పుట్టుకతో అశాంతినే నేను అనుభవించు చున్నాను. నాయీ శరీరములోని ప్రాణమునంటి అది యున్నది. అశాంతివలననే ప్రాణమునిల్చుచున్నది. శాంతము కుదిరినదో, ప్రాణమేలేదు. నేను లేను. నేను ఏమగుదును. ప్రపంచోపశయమైన శాంతము నందు పర్యవసింతును. అగుచో నీ నడుమ దానమును పట్టినయేమి ! నేను భిక్షకుడనై బ్రతికితిని. అది వ్రతముగా చేపట్టితిని. మానాభిమానములు వదలితిని. మరి ఈదానము పట్టుటగూడా భిక్షమువంటిదేగదా! ఏలపట్టరాదు. నేను శౌండ్రకునకు విద్యనిచ్చితిని. అతడు దానికి ఈ ప్రతిఫలము నీ జూచుచున్నాడు. ఇది భిక్షము కాదు. భిక్షము ప్రతిఫలరూపముకాదు. తన్ను తాను అంతరింపజేసికొనుట. ఇది అదికాదు. మరియు నేను శౌండ్రకునకు చెప్పిన చదువేమున్నది. అతడే నాకు చదువు చెప్పెను. ఇట్టులనుకొనుచు మహానందుడు తన్నుతాను సంబాళించుకొ జూచుచుండును.

శ్రీ కృష్ణునితో నున్నప్పుడు అతనికి ఎక్కడలేని ఆనందమును, శాంతమును కల్గుచుండును. అప్పుడతడు తన్ను తానే మరచిపోవును. తాను అను ఒక్కడున్నట్లుండు భ్రమమే అతని కుం

63—వ పేజీ చూడండి

# కాశ్మీర్ బోకె టాల్కుతో గంటలుతరబడి సువాసనగా తాజాగావుండండి

అత్యద్భుతమైన, నాణ్యమైన కాశ్మీర్ బుకె కాస్మెటిక్స్ ఒక సౌందర్య టాల్కు... ఒక బేబీ పౌడరు

పూల గుచ్ఛంలోనికి చొచ్చినట్టు గావుంటుంది, కాశ్మీర్ బుకె టాల్కు యొక్క చల్లని, పూలరేకు వంటి మెత్తదనాన్ని అనుభవిస్తే, వొళ్లు అంతా రాసుకొనండి, నవ వసంతపు ఘుమఘుమలతో రాజిల్లుతారు.



శిశువును సంతోషంగా సౌఖ్యంగా వుంచండి! కాశ్మీర్ బుకె ప్రతి యితర ప్రత్యేక బేబీ పౌడరువలె మెత్తగా, మృదువుగా వుంటుంది. మీ ఇద్దరూ ఉపయోగించదగిన ఒకే పౌడరు అందుబాటులో వుండటం ఎంత మేలు!




# కాశ్మీర్ బొకె

పురుషులు వాంఛించే సువాసనగల టాల్కం పౌడరు

CB 6 19 TEL.

# మనము - మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## లివరు: ఫాస్ఫోలైపిడ్లు

పోర్టల్ వెయిను ద్వారానూ థోరాసిక్‌నాళం ద్వారాను శరీరంలోకిప్రవేశించినకొవ్వుపదార్థములు కొన్ని దహనమై శక్తినిస్తవి. మరికొన్ని వివిధ శరీర భాగములలో నిలవ వుంటవి. మరికొన్ని భాస్వరము అనే వస్తువుతో చేరి "ఫాస్ఫోలైపిడ్లు" గా మారిపోతవి.

భాస్వరముకు ఇంగ్లీషు పేరు 'ఫాస్ఫరస్' "లైపోస్" (Lypose) అంటే కొవ్వు. ఈ రెంటి కలయికవల్ల ఏర్పడ్డవి గనక ఆ వస్తువులకు ఆ పేరు వచ్చింది. ఫాస్ఫోలైపిడ్లలో చాలా రకము లున్నవి.

సాధారణంగా ఫాస్ఫోలైపిడ్ కణములో ఫేటీ యాసిడ్ కణములూ, ఫాస్ఫారిక్ ఏసిడ్ కణములూ నైట్రోజను కణములూ ఉంటవి. ఈ కణముల సంఖ్యనుబట్టీ వాని నిర్మితి విశేషమును బట్టీ అనేక రకములయిన ఫాస్ఫోలైపిడ్లు ఏర్పడతవి. కాని అన్నింటి భౌతిక లక్షణములూ ఒక్క విధంగానే ఉంటవి. ఇవన్నీ కొవ్వు పదార్థములలో కరుగుతవి. రక్త సంచారంలో ఉన్నప్పుడు ఇవి ప్రోటీను కణములతో కలిసి "లైపో ప్రోటీనులు" గా మారిపోతవి. (కొవ్వుతో కలసిన ప్రోటీనులు) శరీరంలో అనేక టిష్యూల నిర్మాణంలో యివన్నీ ఒకేవిధంగా వినియోగపడుతూ ఉంటవి.

శరీరంలో ఉన్న జీవకణములన్నింటికీ కొవ్వునూ, భాస్వరమునూ కలిపి, ఫాస్ఫోలైపిడ్లను తయారుచేసే శక్తి ఉన్నదని చాలామంది శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అయితే ఆ శక్తి కొన్ని ఉపాంగములకు విశేషంగా ఉంటుంది. శరీరంలో తయారయ్యే ఫాస్ఫోలైపిడ్లలో నూటికి 90 పాళ్ళు లివరులోనే తయారవుతవి. మిగతావి ప్రేగుల లోపల ఉన్న మ్యూకస్ పొర లోనూ, కండరముల లోనూ, మూత్రాశయంలోనూ తయారవుతవి (Kidney). ఈ వస్తువుల నిర్మాణానికి అనేక వస్తువులు కూడా ఉండాలి. ఇంతేకాదు. కొన్ని వస్తువులు రక్తంలో అత్యధికంగా ఉన్నప్పుడు, వీటి నిర్మాణం తగ్గిపోతుంది కూడా. విటమిన్ బి సముదాయం (Vitamin B Complex) లో మొదటిదయిన బి౧ విపరీతంగా తినుకున్నప్పుడు అది రక్తంలో నిలవ వుండి, ఫాస్ఫోలైపిడ్ల ఉత్పత్తికి ఆటంకం కలిగిస్తుంది. ఒకప్పుడు ఈ విటమిన్ బి౧ ని సర్వరోగ నివారిణిగా భావించడం జరిగింది. అది శరీరంలో చాలా అవసరమైన వస్తువే. శరీరంలో బి౧ లోపంవల్ల ఏర్పడే వ్యాధులున్నప్పుడు (నరముల ఇన్‌ఫ్లమేషను, బెరిబెరీ) తగిన మోతాదులో తినుకొంటే అది ప్రాణాలనే కాపాడుతుంది. శరీరం ఆహరించలేని పరిమాణంలో అవసరం లేనప్పుడు తింటే మూత్రం ద్వారా బయటికి పోయి వ్యర్థం కావడం, నరములమీదవుండే పొరలు తయారు కావడానికి అత్యవసరమైన ఫాస్ఫోలైపిడ్లు తయారుకావడానికి ఆటంకం కావడం మాత్రమే జరుగుతుంది. ఎవరికి వారే యిష్టం వొచ్చిన విటమిన్ మాత్రలు కొని మింగేవారు యిది గ్రహించాలి.

ఇల్లా తయారయిన ఫాస్ఫోలైపిడ్లు శరీరంలో ఏమౌతవి ? మలముల ద్వారా ఈ వస్తువులు శరీరంలో నుంచి బయటకు పోవు. 'మలము' అంటే ఒక్క మూలస్థానం నుండి మాత్రం బయటికి పోయే పదార్థమే కాదు. కంటినుండి వచ్చే పుసి, ముక్కు నుండి వచ్చే చీమిడీ, చెవులోని గుమిలీ, మూత్రమూ చెమటా ఇవన్నీ మలములే. వీటిలో వేటినుండీ ఫాస్ఫోలైపిడ్లు బయటికి పోవు. అంటే అవి శరీరంలోనే తయారై, శరీరంలోనే వినియోగమయి పోతవన్నమాట. అవి నిర్వహించవలసిన విధులను నిర్వహించిన తరువాత, వాటిని నిర్మించిన అంగములే, ఫాస్ఫోలైపిడ్లను మళ్లీ నాశనం చేస్తవి. ఎప్పటికప్పుడు తయారవుతూ, తాజాగా వుంటేనే గాని యీ వస్తువులు, తమరు చేయవలసిన పనిని చేయలేవు. ఈవిధంగా వీటిని ఎక్కువగా తయారు చేసి నిర్మూలించే ఉపాంగములలో లివరు చాలా ముఖ్యమైనది.

శరీరంలో ఫాస్ఫోలైపిడ్లు నిర్వహించే విధులన్నీ యింకా తేలలేదు. రక్తంలో ఫేటీ ఏసిడ్లు ఒకచోట గడ్డకట్టి రక్తనాళములను మూయకుండా ఈ ఫాస్ఫోలైపిడ్ కణములను అంటి, శరీరభాగములకు పోతూ ఉంటవి. మనం చేయి కోసుకుంటే కొంతసేపటికి రక్తస్రావము దానంతట అదే నిలచిపోతుంది. ఇందుకు కారణం రక్తమును గడ్డకట్టించే వస్తువేదో అందులో తయారు కావడమే. ఆ వస్తువు ఒకరకమయిన ఫాస్ఫోలైపిడే! ఎలక్ట్రిక్ తీగెలను రబ్బరు పొరగానీ ప్లాస్టిక్ పొర గానీ చుట్టి ఉన్నట్లుగా శరీరంలో నరముల పోగులను ఒక రకమయిన వస్తువుతో ఏర్పడిన పొర చుట్టి ఉంటుంది. ఇది నశించినప్పుడు స్పర్శ పోవడం జరుగుతుంది. "పోలియో మయలైటిస్' లో ఇటువంటి పొరలు నశించినందువల్లనే పక్షవాతం ఏర్పడుతుంది. ఈ పొరలన్నీ ఒక రకమైన ఫాస్ఫోలైపిడ్లవల్లనే ఏర్పడతవి. శరీరంలో జీవకణములలో జరిగే అసంఖ్యాక రసాయనిక విక్రుతులు 'ఫాస్ఫరస్' లేకుండా జరగవు. ముడి పదార్థంగా భాస్వరం అన్నింటినీ దహించివేస్తుంది. ఫాస్ఫోలైపిడ్ల నుంచి స్వల్ప పరిమాణములో భాస్వరం జీవకణములకు లభిస్తూ ఉంటుంది.

ఈ ఫాస్ఫోలైపిడ్లలో అతిముఖ్యమైనది 'కొలెస్టరాల్' (Cholesterol) అనే వస్తువు. ఈ వస్తువు భోజనంలో ఉండే కొవ్వు పదార్థములలో కలిసి ఉంటుంది. ఏవిధమైన జీర్ణక్రమం లేకుండానే శరీరం దీనిని ఆహరించుకుంటుంది. శరీరంలో కొవ్వులు జీర్ణమై ఏర్పడిన ఫేటీ ఏసిడ్లతో యిది చేరి ఒక జాతి లవణములు (Esters)గా తయారవుతుంది.

భోజనం ద్వారా లభించిన కొలెస్టరాలు కాక, చాలా కొలెస్టరాలు శరీరావయవములలో తయారవుతుంది. దీనిని తయారుచేసే అంగములలో లివరు అతిముఖ్య మయినది. శరీరానికి కావలసిన కొలెస్టరాలులో నూటికి 70 పాళ్ళు లివరే తయారు చేస్తుంది. కొంతభాగం ఏడ్రినల్ గ్రంధిలోనూ, మరికొంత స్త్రీల రజఃకోశములలోనూ పురుషుల అండములలోనూ తయారవుతుంది. కొంత, అర్టెరీలలోపల వున్న పొరల క్రింద తయారవుతుంది. కొలెస్టరాలుకూ, కొవ్వు పదార్థములకూ అత్యంత సన్నిహితమయిన సంబంధం ఉన్నది. కొవ్వులతో లివరుకు సంబంధ మున్నదని యిదివరకే తెలుసుకున్నాము. ఈ కొలెస్టరాలు ఏవిధంగా తయారవుతున్నదో ఎవరికీ ఇంకా తెలియదు. కాని కొవ్వుల నుండి తయారయ్యే వస్తువుల నుండియే యిదీ తయారవుతుందనీ చాలా మంది విశ్వాసం.

ఈ కొలెస్టరాల్ అనే వస్తువుకు యింత ప్రాముఖ్యం దేనికి ? అనే సందేహం ఎవరికయినా కలుగుతుంది. లివరు స్పందించే పిత్తరసంలో ఇది ముఖ్యమయిన భాగము. ఇది లేకపోతే కొవ్వులు నవనీతములు (Emulsion) కావు. ఏడ్రినల్ గ్రంధి ఈ వస్తువును మార్చి ఎడ్రినలిన్ అనే హార్మోనును తయారు చేస్తుంది. శరీరంలో 'ఎడ్రినలిన్' విధులు కొన్నింటిని యిదివరకే తెలుసుకున్నాము. స్త్రీల రజఃకోశములలోనూ పురుషుల అండములలోనూ తయారయ్యే హార్మోనులు కొలెస్టరాలు నుంచే తయారవుతవి.

పిత్తరసంలో తయారయ్యే పిత్తరస లవణములు కొలెస్టరాలు నుండే తయారవుతవి. కొవ్వులు జీర్ణం కావడానికి ఆహరించబడడానికి యివి ఎంత అవసరమో యిదివరకే తెలుసుకున్నాము.

చర్మంలో ఉన్న పొరలలో కొలెస్టరాలు ఉన్నది. ఇది ఏ ద్రావకాది హానికర పదార్థములతోనూ వికృతి చెందదు. చర్మంలో ఉన్న సూక్ష్మ రంధ్రముల గుండా హానికర పదార్థములు శరీరంలోకి పోకుండా ఈ వస్తువు కాపాడుతుంది. ఇంతే కాదు. ఆ సూక్ష్మ రంధ్రముల గుండా శరీరంలో ఉన్న నీరు మితిమీరి ఆవిరి అయిపోకుండా కొలెస్టరాలు కాపాడుతుంది. చర్మంలో యీ వస్తువే లేకపోతే, మన శరీరంలో నుంచి మనకు తెలిసీ, తెలియకుండానూ, యిగిరిపోయే చెమట పరి

55—వ పేజీ చూడండి

# కవి సార్వభౌముడు

## నోరి నరసింహ శాస్త్రి



### కృతజ్ఞతావచనము

'కవిద్వయము' అని శ్రీనాథుని పోతనను కలిపి ఒకే నవలలో చిత్రింపవలెనను ప్రయత్నములో సతమతమవుచున్న సమయములో సరిగా శ్రీ శంభుప్రసాద్‌గారి సూచన వచ్చినది. వెంటనే కవిసార్వభౌముడు-సహజ పాండిత్యుడు అనే రెండు నవలలుగా వ్రాయుట ఉచితమని స్ఫురించినది. ఈ విధముగా ఈ నవల రూపొందుటకు వారి యాదేశమే నిమిత్త కారణమైనది. అందుకు వారికి ముఖ్యముగా నా కృతజ్ఞత తెలుపుచున్నాను.

ఈ నవలలో శాస్త్రవాదములువచ్చు ప్రకరణములు నేను వినిపింపగా, శ్రద్ధగా ఆలకించి మంచిసూచనలు చేసిన మిత్రవర్యులు వేదాంతపారీణ, వ్యాకరణ శిరోమణి శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారికి నా కృతజ్ఞతాభివందనములు.

దీనిని ప్రకటించిన ఆంధ్రసచిత్రవారపత్రికా సంపాదకులకును శ్రద్ధగా పఠించిన పాఠకలోకమునకును కృతజ్ఞుడను.

రేపల్లె, 28-2-62. నోరి నరసింహశాస్త్రి.

రాచవేమారెడ్డి పెద్ద సేనతో దన్నడకోటల విడిసియుండెను. రేవులోనున్న యాతని రక్షకభటులు శత్రుపక్షమునుండి వచ్చుచున్న వారి పడవను పట్టుకొను ప్రయత్నములో నుండిరి. పడవ ప్రవాహ మధ్యమునకు వచ్చునప్పటికి, వారు కులదైవతమగు వండికంతపోతరాజును శ్రీనాథాది పండితులనుగుర్తించి ఎత్తిన యాయుధములు దింపిరి. పడవ రేవులో నాగినంతనే, భటులు వినీతులై శ్రీనాథాదులకు నమస్కరించి, రాచవేమారెడ్డి ప్రభువు దన్నడకోటలో నున్నాడని నివేదించిరి.

కటారిని కొనివచ్చుచున్నవారిని ప్రభువుంకు కటారి నర్పింపుడని నియోగించి, శ్రీనాథుడు వీర నారాయణులను దహనముకావించిన ప్రదేశ మెక్కడ నున్నదో అడిగి తెలిసికొని సరాసరి అక్కడి కరిగెను. ఆ తావున మారాంబకు పేరంటాలు కళ ప్రతిష్ఠితమై యుండుట కనబడినది. శ్రీనాథుడును, మిత్రులును అక్కడ పరలోక గతులకు అశ్రుతర్పణము కావించి, కృష్ణాస్నానము చేసి పత్రమునకు వెళ్లిరి. వా రక్కడ మూడు దినములు విడిది చేసిరి. రాచవేమారెడ్డి యొద్దనుండి వారికి పిలుపు రాలేదు. విచారింపగా కటారిని శత్రువుల వద్దించి తెచ్చినందులకు, ప్రభువు సంతోషింపలేదని తెలియవచ్చినది. మద్యపాన పారవశ్యమున ఎక్కువ కాలము గడచుచున్న దనియు శ్రుతమైనది. నూతన ప్రభువు పిలువనంపనిది శ్రీనాథు డాయన యొద్దకు పోవ నిచ్చగింపలేదు.

మూడు దినములు నిరీక్షించి శ్రీనాథుండ విషాదముతో సపరివారుడై ప్రయాణమై మూడవ నాటికి కొండవీడు చేరుకొనెను. శ్రీశైల ప్రదక్షిణము పూర్తియైనది.

కొండవీటికి వెనుకటి కళ లేదు. వీరు నారాయణుడు లేని యా నగరము శూన్య గృహము వలెనే శ్రీనాథునకు పొడకట్టెను. ముం దాతడు సింగన ప్రధానిని దర్శించి యాత్రా విశేషములు తెలిపి దన్నడకోట వృత్తాంతమును చెవిని వేసెను. సింగన యిట్లనెను :

"శ్రీనాథభట్టా, నీవు బయలుదేరునపుడు ఒక శోకములో నుంటివి. ఇప్పుడు మన మున్న లోకము వేరు ! కొండవీటి రాజ్య మింకను క్షీణించినది. అనుభవములేని నూతన ప్రభువు యుద్ధవ్యయములకై క్రొత్త క్రొత్త పన్నులు విధించుచున్నాడు. పురిటిపన్ను కూడా విధించినాడు ! మేము వద్దని వారింపగా చెవిని పెట్టక, మద్యపు మైకములో నోటికి వచ్చినట్లు పలికెను. వృద్ధుడై మతిభ్రమణము కలిగిన పెదకోమటి ప్రభువును, మన మందరము కుట్ర పన్ని విద్యావిజయమును వంకతో భ్రమపెట్టి,

—48వ పేజీ చూడండి

# అద్దె కొంపలూ - అగచాట్లూ

మానాన్నగారు ఉద్యోగరీత్యా అనేక ఊర్లు తిరుగుతూవుంటారు. మనం వెళ్ళినప్రతిఊరు లోను స్వంత ఇల్లు వుండడం అసంభవంకదా. ఈ అద్దె ఇంట్లోనే కాలక్షేపం చెయ్యవలసి వస్తుంది. మేము చూచిన ఊరిలో అద్దె ఇంటి ముచ్చట్లు వ్యాసరూపంలో వెలువరించాలని బుద్ధి పుట్టింది.

సాధారణంగా మనఇల్లు, మనవస్తువు అనగానే ఇంకెవరికేనా ఇస్తే పాడుచేసేస్తారనో, వాళ్ళకి వాడు కోవటం చేతకాదనో భయపడటం సహజం. కాని కొంతమంది అసహజత్వాన్ని అతిగా తీసుకుంటారు. అద్దెకివున్నవాళ్ళని ఏదిక్కుదివాణం లేనివాళ్ళ ఏదిక్కూదివాణం లేనివాళ్ళకిందో, గతిలేని వాళ్ళ క్రిందో, జమకట్టేవాళ్ళున్నారంటే అతిశయోక్తి కాదు. అద్దెకున్నవాళ్ళకు కూడా స్వంత కొంపలుంటా యనిగాని, వాళ్ళుకూడాతమలాగే అద్దెలకిచ్చి కాని ఊళ్ళో అవసరాలు గడుపుకుంటున్నారని ఊహించని వాళ్ళున్నారంటే ఆశ్చర్యంలేదు.

మానాన్నగారికి ఒకసారి బెజవాడ ట్రాన్స్ఫరు అయింది. నాన్నగారుముందుగానే ఒకఇల్లు (భాగం) అద్దెకితీసుకుని తక్కిన కుటుంబాన్ని తీసుకు వెళ్ళాము. మేము వెళ్ళగానే ఆ ఇంటి బామ్మగారు (ఇంటావిడ) ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించి ఇల్లంతా చూపిస్తూ దానికున్న సదుపాయాలతో తెగపొగిడేసి, ఆఖరికి బెజవాడంతా గాలించినా ఇంత మంచిఇల్లు దొరకదని తేల్చేసింది. ఆవిడ వెళ్ళిపోయిన తరువాత మేము ఇల్లంతా సర్దుకున్నాము. ఆవిడ చెప్పినదాంట్లో కొంత నిజంలేకపోలేదు లెండి.

రెండుమూడురోజులు కులాసాగానే గడిచాయి. నాలుగోనాడు ఉదయం ఇంటివారమ్మాయి అతి వినయంగా వచ్చి అంతకంటే వినయంగా వాళ్ళమ్మ ఒకగ్లాసుడు పంచదార ఇమ్మందని, సాయంత్రం పట్టుకొచ్చి ఇచ్చేస్తానని చెప్పింది. సరేసాయంత్రం ఇచ్చేస్తుందికదా అనిఅమ్మఇచ్చింది. ఆసాయంత్రం, మొదటి రోజు మమ్మల్ని ఆహ్వానించిన బామ్మగారు వచ్చి ఒక అరగంటసేపు కులాసాగా కబుర్లుచెప్పి (పంచదార ఊసురాకుండా) రెండుసేర్లు బియ్యం అప్పియ్యమ్మా, మావాడు (కొడుకు) ఇంకా ఆఫీసు నుంచిరాలేదు రేపుఉదయం పంపిచేస్తానని చెప్పింది. అమ్మలేదన లేకపోయింది. ఇక అక్కడ్నుంచి ప్రతిపూట మొదలు సాయంత్రంవరకు ఏదో ఒకవస్తువు అరువు అంటూ పట్టుకెళ్ళడం, ముందు రోజు పట్టుకెళ్ళిన నాటి ఊసెత్తక పోవడం. ఒకవారంరోజులు తరువాత అమ్మ నాన్న గారితో ఇంకెక్కడేనా ఇల్లు అద్దెకు తీసుకోండని పోరుమొదలెట్టింది. చిన్నచిన్న సంసారాలు గడ వటమే కష్టమవుతున్న యీ రోజుల్లో రెండు సంసారాలు భరించడం అంటేమాటలా.

మరొకరకం ఇంటివారు గోడలకి మేకులు కొడితే ఇల్లునాశనం అయిపోతుందని పోరుపెడ తారు. వాళ్ళింట్లో మాత్రం ఇంటినిండా పటాలు వేలాడదీసుకుంటారు. మాదొడ్డమ్మగారికి ఒకపెద్ద ఇల్లుంది. ఆవిడ కొడుకు కోడలు. ముగ్గురు మనుష్యులకింతఇల్లు ఎందుకని సగంవాటా అద్దెకి ఇచ్చింది. ఇంక అద్దెకున్న వాళ్ళకి ఆవిడ పెట్టిన షరతులువింటే మనం ఆ ఇంట్లో వుండడానికా లేక వూరికినే అద్దెఇస్తూ ఎక్కడో వుండడానికి అనిపిస్తుంది. ముఖ్యంగా కరంటు, నీరు విష యాల్లో ప్రతిరోజు ఆవిడతో యుద్ధమే. అద్దెవాటాలో ఎన్నిబల్బులున్నాయో అన్నిటికీ బల్బుకింత అని పుచ్చుకునేది. కాని రాత్రి 9 గం. తరువాత లైట్లు వెలిగించరాదనేది. ఎవరేనా, "దొడ్డమ్మగారూ, బల్బుకింతని పుచ్చు కుంటున్నారు కదా వాళ్ళేలా వాడుకుంటే ఏమిటం దుకు? లేకపోతే వేరేమీటరు పెట్టించ కూడదూ?". అంటే చెప్పినవాళ్ళ మీదకి యుద్ధం ప్రకటించేది. నీళ్ళుకూడా లెక్కగా పట్టుకోవల్సిందే. పెద్దపెద్ద పట్టణాల్లో ఇల్లు దొరకడమే కష్టమవుతున్న యీ రోజుల్లో ఇలాటి దొడ్డమ్మలు పెట్టిన షరతులకు తలఒగ్గక తప్పదు. ఏ రెంటు కంట్రోలూ వీళ్ళని కంట్రోలుచెయ్యలేదు.

ఒక్కొక్క ఇంట్లో ఇంటివారి పిల్లలు చేసే అల్లరి చెప్పనలవికాకుండా వుంటుంది. పైగా అంటే ఇంటావిడ కయ్యానికొస్తుంది. అల్లరి పిల్లలుచెయ్యకపోతే ముసల్వాళ్ళు చేస్తారా అంటుంది. ఎవరిపిల్లలు వాళ్ళింట్లో అల్లరి చేసుకుంటే బాగుంటుంది కాని ఇరుగుపొరుగువాళ్ళ ళ్ళల్లో అల్లరిచేస్తే ఎవరుభరించగలరు? ఒకసారి మేము అద్దెకున్న ఇంట్లో వారికి నా వయస్సు అమ్మాయి ఉంటుంది. అతిచనువుతీసుకొని అస్త మానూ మాఇంట్లోనే మారేడియో రేడియో ఇష్టం వచ్చినట్లు పెట్టేస్తూవుండడం, ఏదేనా కొత్త పుస్తకం కంటబడగానే చదివి ఇస్తానని పట్టుకు పోతావుండడం చేస్తూవుండేది. సినిమాలకేక పోయేవాళ్ళం. ఆఖరికి జ్ఞానం వాళ్ళకుండాలిగాని ఇంకొకరిచేత చెప్పించుకోవాలా? ఇంక ఇంట్లో ఏదేనా టిఫిన్ చేసుకోవడం భయం. ఇంటివారి పిల్లలందరూ మనింట్లోనే వుండేవారు.

పైన వ్రాసిన విషయాలు స్వయంగా చూసి అనుభవించిన మీదట వ్రాసినవేగాని ఊహాగానం మాత్రంకాదు. అద్దె కొంపల్లోవుండే ప్రతివారికి ఇటువంటి అనుభవాలు కలగడం సహజం. నిజానికి ఇవేమీ పెద్ద విషయాలు కాకపోయినా మనస్సుకు చాలా చికాకు కలిగిస్తాయి. ★



చిత్రకారిణి కె. లలిత (సికింద్రాబాద్)



# వనితా వాణి

## నేటి స్త్రీల సమస్య

ఇరుగు పొరుగు అమ్మలక్కలు అనే మాటలు చిన్నపిల్లల కోమల హృదయాలకు గాయపరచటమే గాక, తల్లిదండ్రులకు ఎంతగానో కుంగ దీస్తాయి. ఇటువంటి విషయాలు పల్లెటూళ్లలో మరీ ఎక్కువ.

సీతామహాలక్ష్మమ్మ (కంకిపాడు)

* * *

పెళ్ళికాని పిల్లలను చూసి బుగ్గలు నొక్కుకునే అమ్మలక్కలకి ఈ వ్యాసం చాలా బుద్ధి చెబుతుందనే నా ఉద్దేశము. అలాంటివారికి ఈ వ్యాసం ఔషధంలా ఉపయోగపడుతుంది. మొదట వెయ్యి మాటపడపోర్లు కట్నం తీసుకుని, తరువాత మాటిపోటి మాట లనేవారు కూడ ఉన్నారు. దేశంలో మధ్యతరగతి స్త్రీలు ఎంత బాధపడుతున్నారో గదా! లోకాన్ని ఎదిరించినా, సంఘం స్త్రీని వేలుపెట్టి చూపుతుంది. ఇప్పుడు అన్నిటికంటె డబ్బు ప్రధానం అయినది.

అచ్యుతం వెంకటాచారి (వరంగల్)

* * *

ఒక అమ్మాయి ఉద్యోగం చేస్తున్నదంటే ఆమె ఏట్టి పరిస్థితిలో ఆ ఉద్యోగం చేస్తుందో తెలుసుకోకుండానే ఆమెపై చిలువలు పలువలుగా కల్పించి, చివరికి ఆమె పతనానికి కారకులయ్యే అమ్మలక్కలకు ఈ వ్యాసం ఒక చక్కని గుణపాఠం!

జాసరి శ్యామల (గుంటూరు)

* * *

మధ్యతరగతివారింట్లో ఆడపిల్ల పుట్టినదన గానే ఆ ఆడపిల్లేనా అని ఒక్కసారి చప్పరించి ఊరుకుంటారు. నిజానికి ఈ ఆడపిల్లల బాధలు చూస్తుంటే చెప్పనలవికాదు.

అనూ, కౌంసల్యా (నిజామాబాద్)

* * *

మానవసమాజములో మధ్యతరగతికి చెందిన ప్రజావళి పడుచున్న మానసిక క్షోభను పునరాలోచన చేసుకుంటే ప్రపంచము కండ్లు ఉండి కూడా చూడలేకున్నట్లు తేలుతుంది.

ఈవిధంగా ఆవేశపూర్వకమైన అనుభవాలను లోకానికి వ్యాసమూలముగా యింకా తెల్పగలరని ఆశిస్తున్నాను.

ఎస్. ఇందిర (నెల్లూరు)

* * *

23—2—62 సంచిక వనితావాణిలో "స్త్రీలే స్త్రీజాతిని కించపరచడం చాల అవశ్యం" అని వ్రాశారు. అది పొరపాటు. వాస్తవిక ప్రపంచంలో ఒక స్త్రీని దూషించి, నిందించి, ఆ స్త్రీ జీవితానికి లేని కళంకాన్ని తెచ్చిపెట్టేది మరొక స్త్రీయే గాని పురుషుడు కాదు. అటువంటప్పుడు "దీనికి కారణం పురుషులే" అని అనవసరంగా ఎలా నిందించగలం? ఎవరికి వారు (స్త్రీకి సాటి స్త్రీ, పురుషునకు సాటి పురుషుడు) బుద్ధి చెప్పుకోవాలి అంతే!

కుమారి టి. భూమాదేవి (చిత్తూరు)

* * *

వరకట్నాలు ఇవ్వలేని తల్లితండ్రులు వారి అమ్మాయిలను చదివించితే లేక ఏదో ఒక ఉద్యోగానికి పంపితే ఇరుగు పొరుగు అమ్మలక్కలు అప్పుడే వారిపై గుసగుసలు చెప్పుకుంటారు. స్త్రీకి జీవితమంతా ఎటుచూసినా ముందు నుయ్యి వెనుక గొయ్యిలా గుంటుంది. అందుకే ఊరికే అంటారా పెద్దలు "స్త్రీ అయి పుట్టే బదులు చాకలాడింట్లో గాడిదై పుట్టేది మేల"ని. స్త్రీ జీవితమంతా ఇంతే!

ఎస్. భాగ్యలక్ష్మి (బళ్లారి)

* * *

నేటి స్త్రీల సమస్యలు అన్న వ్యాసము రేఖ దేవిగారు సాలా విపులముగా వ్రాశారు. సోదరీమణులకు అర్థమయేటట్లు వ్రాసినందుకు చాలా సంతోషము. మధ్య తరగతి కుటుంబాలలో కట్నాలు యిచ్చుట కష్టముగా ఉన్నది. వివాహము మాని తలిదండ్రులు విద్య చెప్పిస్తే ఆ స్త్రీ చదువుకొనుచున్నది అనుకొండి. ఇరుగు పొరుగు వారి గుసగుసలు ఇక వినలేము కదా.

జి. రాజేశ్వరి (చెరుకుమిల్లి)

* * *

ఏ యిబ్బందులు, చిక్కులు వచ్చినా మధ్య తరగతి కుటుంబీకులకే. ఆ సమస్యలన్నీ రచయిత్రి కళ్లకు కట్టినట్లుగా రాశారు. ఈ సమస్యలను తోటివారికి వస్తే మనకు కాదా అనుకునే మనస్తత్త్వం లేకపోవడంవల్లనే ఈ చిక్కు. ఇటువంటి వ్యాసాలు చదివైనా మనసమాజం కొంచెం బుద్ధి తెచ్చుకుంటే బాగుంటుంది. ఎదుటి వచ్చ చూసి వోర్వలేనితనం సమాజంలో బాగా ప్రబలింది.

పి. రత్నమాల (సోంపేట)

* * *

ఇలా పత్రికలలో వ్యాసాలు వ్రాయటంవలన మనుష్యుల ధోరణి, మనస్సు, ప్రవర్తన మారుతాయని ఆశించటం కేవలం పొరపాటేనేమో నని పిస్తుంది. నిజంగానే వీటి వలన మనుష్యులు మారగలిగితే అంతకంటె కోరవలసినది ఏమీ ఉండదు. ఎప్పుడూ స్త్రీల బాధలు, సమస్యలు చూస్తూనే ఉన్నాం కదా! దానికి తోడు కొద్దో గొప్పో వినోదం కోసం చదివే యీ పత్రికలలో కూడా సమస్యలే చదివితే మనస్సు మరీ మొద్దుబారిపోదా? పోనీ వీనివల్ల కాస్తయినా ప్రయోజనం ఉంటే ఫరవాలేదు. అది లేనప్పుడు అదే పనిగా వీటిమీద వ్యాసాలు ప్రచురించటం నిరుపయోగమేమో ననుకుంటాను.

అందుకని నేను కోరే దేమిటంటే అప్పుడప్పుడునైనా యీ సాంఘిక సమస్యలనుంచి మనస్సును, దృష్టిని తప్పించి, లలితకళలమీదికి, త్రిప్పటం అవసరమేమో. అయితే ప్రజల గ్రంథపఠనాసక్తిని పెంపొందింపజేస్తారనుకుంటాను.

ఎన్. రమ (అరుగోలను)

* * *

"నేటి స్త్రీల సమస్యలు" బాగా వ్రాశారు. ఇంకా వారు ఎన్నో విషయాలు వదలివేసినారు. మధ్యతరగతి పిల్లలు పడే బాధ భగవంతునికే తెలుసును. యుక్త వయస్సు వచ్చేసరికి ఇటు తల్లిదండ్రులను ఎదిరించలేక, అటు యిష్టమయిన వరుని ఎన్నుకోలేక బాధపడే స్త్రీలు కోకొల్లలు. వారు యథార్థంగా ఉన్నవి ఉన్నట్లు వ్రాసినందుకు నా అభివందనములు ఇంకా ఇటువంటి వ్యాసములు వ్రాస్తారని నమ్ముతున్నాను.

మంగు వెంకటనర్స (బర్సుర)

* * *

ఆడపిల్ల జీవితం మధ్యతరగతి కుటుంబాలలో కంటె గొప్పవారి కుటుంబాలలోనే ఎక్కువ కష్టం. వీరికి ఆడపిల్లలు అంటేనే భయం. మధ్య తరగతి వారు వరకట్నములు యివ్వలేక బాధపడుతుంటే ధనవంతులు పెంచి పెద్ద చేయుటకు బాధపడతారు. ఎలాగో పెద్ద చేస్తారు. ఆమెకు 18 ఏళ్ళు దాటితే చాలు ఇక ఇరుగమ్మలు, పొరుగమ్మలు ఒకటే గుసగుసలు. మీ అమ్మాయికి ఎప్పుడు పెండ్లి చేస్తారు? మీ అమ్మాయి తోటిది మా అమ్మాయి. అప్పుడే ముగ్గురు పిల్లలు అని ఎంతో హేళనగా ఆమె తలిదండ్రుల దగ్గర అంటారు. వారు ఎంత బాధపడతారో కూడా ఆలోచించరు. తల్లితండ్రులు తమ బాధ కూతురుమీద చూపిస్తారు. లోకులు అనే మాటలకే బాధపడుతుంటే ఇక కన్న తల్లిదండ్రులు కూడా మాటలు అంటే ఆమె జీవితం చాల కష్టం. నేటి స్త్రీలసమస్యల గురించి "రేఖ" గారు చక్కగా వ్రాసిరి. వారికి నా ధన్యవాదములు.

కె. సుజాత (మోరి)

* * *

రేఖగారు చాలా బాగా వ్రాశారు. నేడు మధ్య తరగతి కుటుంబాలలో జరిగేవి కళ్లకు కట్టినట్టు వ్రాశారు. మధ్య తరగతి కుటుంబములోని పెద్దవారుని గురించి వ్రాసినది అక్షరాల నిజము. మధ్యతరగతి కుటుంబములోని అమ్మాయిలు

లిందరో ఈ బాధలు భరించలేక ఆత్మహత్యలు చేసుకున్నారు. అమ్మాయిల హృదయాలను పెద్దవారు గ్రహించలేరు. వారి మూర్ఖపు పట్టు వారిదే. గొప్పవారుకాని, లేనివారు కానీ, యిలాంటి విషయాలు పట్టించుకోవరు. ఇలాంటి వ్యాసము వ్రాసినందుకు రేఖ గారికి పత్రిక ద్వారా నా అభివందనములు తెలిపేది.

కె. ఎస్. సరోజాదేవి (అనంతపురం)

* * *

నేటి స్త్రీల సమస్యలు అన్న వ్యాసం రేఖాగారు చాల బాగా వ్రాశారు రేఖగారికిని మీకును నాయొక్క హృదయపూర్వకపు అభివందనములు.

కుమారి కె ఆంజలీన (బాన్సువాడ)

* * *

"నేటి స్త్రీల సమస్యలు" చాలా, చాలా బాగుంది. ఆమెకు ఎట్లా అభివందనాలు తెలుపాలో నాకు తెలీకుండా ఉన్నది. ఒక్కమాటలో చెప్పాలంటే నేటి స్త్రీలపైన నిందలు మోపడానికికారకులు అమ్మలక్కలే !

సంఘం, సంఘం అంటూ భయపడుతూ స్త్రీలు వెనకబడ్డారు చాలామంది. రేఖగారు ఇటువంటి వ్యాసాలు మరికొన్ని వ్రాస్తారని నేను ఎదురుచూచుచున్నాను.

కుమారి సందారపు పార్వతి, (సి. బి. బళ్లారి)

* * *

## మనకుటుంబవ్యవస్థ

"మనకుటుంబవ్యవస్థ" వ్యాసములో రామేశ్వరము వెళ్లినా శనేశ్వరము వదలలేదను మాట పూజ్యులైన పెద్దలతో పోల్చుట చాలా అసభ్యకరముగా నున్నది. మధ్యతరగతి కుటుంబములలో ఉన్న కొద్ది ఆస్తి అమ్మి తమ కుమారునికి చదువు చెప్పించినప్పుడు కుమారులు పెద్దవారై ఉద్యోగము చేయునప్పుడు పేదవారైన తల్లిదండ్రులు కొడుకుల దగ్గర ఉండక ఎక్కడ ఉండెదరు ? ఈ కాలములో వేరువేరుగా ఉండిన ఖర్చులు కొడుకులు ఒక్కరే భరించుట కష్టము. తండ్రులు సంపాదించలేరు. అటువంటప్పుడు సమిష్టికుటుంబములు ఉండకుండా ఎట్లు ఉండును ?

పి. శారదమ్మ (బాపట్ల)

* * *

కోడలును కాస్త సాధించటము అత్తగారికి సరదా. అంతేకాని ద్వేషం కాదు. కాని అత్తగారు మంచిదయితే అంతకన్నా సాధించే కోడళ్లే ఎక్కువ. అత్తగారు కొంచెము చనువివ్వగానే రోజూ సినిమాలు, వదులు జడలు, పెద్దబొట్లు ఇష్టము వచ్చినట్లు తిరిగే కోడళ్లు చాలా ఎక్కువ. అట్లాంటప్పుడు అత్తగారు కోడలిని అదుపులో పెట్టటం తప్పులేదు. ఎప్పటికయినా పెద్దవాళ్లు చెప్పటము మంచిదే.

ఎకా ఆదిలక్ష్మి (గుంటూరు)

నేను చాలా చోట్ల చూచాను, చదువుకున్న అమ్మాయిలంటే అత్తలకు మరీ విరసన. కాని రచయిత్రి ఎంతసేపు అత్తలను గురించి వ్రాశారు గాని, కోడళ్ల తప్పులు చెప్పలేదు. అత్తగారు మంచిదైనా (ఒకవేళ) వాళ్ల పొత్తు కిట్టక సహాయపడకుండా ఉండే కోడళ్ల సంగతి వ్రాయలేదు పాపం.

కుమారి సామవేదం లక్ష్మి (చిత్తూరు)

* * *

నీచ, కర్కశ హృదయులు, సంఘ సంస్కర్తలమని చెప్పుకొని సమాజాన్ని వారి విషపు కోరలతో ఎలా నాశనం చేస్తారో వ్యాసంలో సరిగా వివరించలేక పోయినారు. పై వ్యాసంలో వారు ఉదహరించిన రాధ తల్లిదండ్రుల వంటి విశాల హృదయులు ఈ నవీన ప్రపంచంలో మిక్కిలి అరుదు.

కె. నిర్మలాదేవి (తుంగభద్రా డాం)

* * *

మాకు తెలిసిన ఒక ఉమ్మడి కుటుంబము ఉన్నది. (వారికి ౫ గురు కుమార్లు, ౫ గురు కూతుళ్లు) ఇద్దరు కోడళ్లు ఉన్నారు. వీరి మాటకు ఎప్పుడు ఎదురు చెప్పటముగాని జరిగేది కాదు. కాని మూడవ కోడలు వచ్చిన తరువాత వారి కుటుంబమువిడిపోయినది. ఇట్లా జరుగుటకువారి కోడలు కారణమో అత్తగారు కారణమోతెలియదు.

ఎం. సుభద్రా బలరామదుర్గ రాజు (వెరుకుమిల్లి) ★

ఎప్పుడూ ఇంతే—120

శంకర్



# శుభవార్త!



## ఒక కొత్త
## Godrej గోద్రెజ్ సబ్బు

ఝులక్ చాలా ఎక్కువ బట్టలను ఉతుకుటకు సమృద్ధియైన నురుగును త్వరితంగా యిచ్చునట్లు ప్రత్యేక విధానమున తయారు చేయబడినది — శ్రమలేకుండా తెల్లబట్టలను మెరిసే తెల్లగాను రంగు వాటిని అధిక కాంతిగాను వుతుకును.

హాయిగొలిపే పరిమళంగల ఈ కొత్త సబ్బును వాడి చూచి, ఝులక్ సామాన్య బారు సబ్బులకంటె ఎట్లు చాలా కాలము నిలవుండునో తెలివైన గృహిణులు ఇదివరకే చేసినట్లు, మీరే ఋజావుపరచుకోండి

ఝులక్‌ను బజార్లలో అమ్మకముచేయుచున్న మార్గదర్శక సంస్థ గోద్రెజ్. సబ్బులలో ఉత్తమ నామము-ఇంతకంటే ఎక్కువ హామీ ఇంకేమి కావాలి.

# ఝులక్






# డాక్టర్ రాజు

బొమ్మల కథ

**దేవిక**

16

నాకు ఏడుపొచ్చింది ఇంతలో.....వచ్చాడు...







డాక్టరురాజు మళ్లీ వారం రోజులవరకు కన్పించలేదు







నే చేసిన దాంట్లో తప్పేమి కనుపించలేదు...



# ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటనలు
# మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి



## కాఫీ సర్వదా ఉత్తేజపరుస్తుంది




కాఫీ తృప్తినిస్తుంది




కాఫీ బోర్డు,
బెంగుళూరు

* "ప్రతిసారి మంచి కాఫీని తయారుచేయడం ఎలా" అన్న ఉచిత కరపత్రంకోసం మాకు వ్రాయండి.

(FDS/CB/4-T8)



### జరిగిన కథ

రామవరం ఆంధ్ర – ఒరిస్సా రాష్ట్రాల సరిహద్దు ప్రాంతంలో ఒక గ్రామం. శ్యామబాబు అక్కడ దిగి, ఆ ఊరిలోనే వైద్యవృత్తి చేసుకుంటున్న రాధాకాధ మిశ్రా గారిని కలుసుకుని ఆయన సహాయంతో ఉద్యోగం సంపాదించుకుంటాడు. రామవరంలోని మిల్లు యజమాని సత్యనారాయణరావుగారు తన పిల్లలకు శ్యామబాబు ట్యూషన్ చెప్పే ఏర్పాటు చేయిస్తాడు. నారాయణి మిశ్రా గారి పనిమనిషి. మిశ్రాగారు త్రాగుబోతు. ఒకరోజున పోలీసులు ఆయనను పట్టుకుంటే శ్యామబాబు జరిమానా చెల్లించి విడిపిస్తాడు. మిశ్రాను విడిపించుటకు పోమి నిర్చిన సూర్యప్రకాశరావు పేకాటలో ధనం పోగొట్టుకొని ఆత్మహత్యకు పూనుకొనగా శ్యామబాబు రక్షిస్తాడు. మిల్లు గుమాస్తా ధర్మసూరి కుమార్తె లలితను చూసి శ్యామబాబుకు పూర్వస్మృతులు వస్తాయి. లలితను వివాహం చేసుకోవాలని, ధర్మసూరి మేనల్లుడు శంకర్ ధర్మసూరిగారింటికి వస్తాడు. ధర్మసూరిగారు తన కుమార్తెను శంకర్‌కు చేసుకోవలసిందిగా శంకర్ తలిదండ్రులను అడిగి విఫలుడౌతాడు. తన తలిదండ్రులకు ఇష్టంలేకపోయినా లలితను వివాహమాడతానని శ్యామబాబుతో శంకర్ అంటాడు. ధర్మసూరిగారు వేరే సంబంధం చూసి లలిత పెళ్ళి చేయాలనుకుంటారు. శ్యామబాబుకు రామవరం జమీందారు కాంతారావుతోను, దినకరరావు అనే వ్యవసాయశాఖోద్యోగితోను పరిచయం ఏర్పడుతుంది. బంగారం చేసే ప్రక్రియ లోపిచ్చగల కాంతారావును మిశ్రబాబులు మంచినూరంలో పెట్టారు.

ఆ వూరికి శ్యామ్‌బాబు వచ్చి పదకొండు మాసాలు పైగా అయింది. ఆయన ఈ వూరిలో ఏదో ఉద్యోగంచేసి, డబ్బుసంపాదించి, ఢిల్లీవెళ్లే ఉద్దేశంతో ఈ వూరు వచ్చినట్లు అందరితో మొదటినుంచి చెప్తున్నారు. కాని ఆయన డబ్బు ఖర్చుచేసే విధానం చూస్తే, ఆయన కోరిక ఎప్పటికి నెరవేరుతుందా? అనే సందేహం ఎవరికైనా కలుగుతుంది. సత్యన్నారాయణగారు శ్యామ్‌బాబుకు నెలకు ఎనభైదాకా జీతం ఇవ్వడంలో చాలా ఉదారత చూపించారు. కాని, ఆ ఎనభై రూపాయల్నీ శ్యామ్‌బాబు రెండు మూడు రోజుల్లో ఖర్చు పెట్టేసేవాడు. మళ్లీ నెలాఖరుదాకా డబ్బుకు ఇబ్బంది పడేవాడు. సాధారణంగా ఇతరులకోసం డబ్బు ఖర్చుపెట్టవలసివస్తే ఏమాత్రం జంకేవాడుకాదు. డాక్టరు మిశ్రకు అనేకసారులు సాయం చేశాడు.

ధర్మసూరిగారి కుటుంబానికి ఆర్థికంగా ఎక్కువ సాయం చెయ్యలేదుగాని, లలితకు మెట్రిక్ పుస్తకాలూ, పరీక్షఫీజూ మొదలైనవి తను భరించాడు. దానికి తగ్గట్టు, ధర్మసూరిగారి కుటుంబం కూడా ఆయనకు అనేక సారులు సాయం చేశారు. సత్యన్నారాయణగారివద్ద, డాక్టరు మిశ్ర పెళ్లి కోసం వందరూపాయలు అప్పు కూడా చేశాడు శ్యామ్‌బాబు. ఎందువల్లనంటే మిశ్రగారు నారాయణికి అయిదు తులాల బంగారం పెట్టనేగాని, తాళికట్టడానికి వీల్లేదని నారాయణి అన్నదమ్ములు అన్నారు. పైగా ఎన్నాళ్లనుంచో నారాయణి మనసులోవున్న తిరుపతి మొక్కు కూడా పెళ్లవగానే చెల్లించాలని నారాయణి పట్టుపట్టింది. ఏకంగా రెండు నెలలపాటు యాత్రలన్నీచేసి వద్దామని దంపతులిద్దరూ నిశ్చయించుకొన్నారు. అందుకు డబ్బు చాలకపోతే మిశ్ర శ్యామ్‌బాబును కొంత సాయం చెయ్యమన్నాడు.

అసలు సత్యనారాయణగారి అమ్మాయికీ, అబ్బాయికీ పరీక్షలయిపోయాయి. లలిత మెట్రిక్ పరీక్షలు కూడా అయిపోయాయి. సత్యన్నారాయణగారికి శ్యామ్‌బాబు అవసరం ఎక్కువలేదు. పైగా వరిస్థి విశ్వం, ఇద్దరూ వూళ్లో కూడా లేరు. తమ చుట్టాలింటికి వెళ్లారు. అయినా, శ్యామ్‌బాబు వంద రూపాయలు అప్పు అడగగానే ఇచ్చేసారు సత్యన్నారాయణగారు. ధర్మసూరిగారికి శ్యామ్‌బాబు పరిస్థితి తెలుసు. ఆయన కూడా చాలా ఇబ్బందులలో వున్నారు. కాని వారిద్దరూ ఏనాడూ తమ ఇబ్బందుల్ని గురించిగాని, చికాకులను గురించిగాని మాట్లాడుకొనేవారుకారు. పరస్పర పరిస్థితులు తెలిసీ కూడా ఒకరికొకరు సాయం చేసుకోలేని స్థితిలో వుండేవారు.

డాక్టరు మిశ్రగాని, దినకర్‌గాని వూళ్లోవుంటే శ్యామ్‌బాబు రాగానే అతనికి టిఫిన్, టీ మొదలైనవి ఇచ్చేవారు. వాటితో కాలక్షేపం చేసేవాడు ఆ పూటకు శ్యామ్‌బాబు. మిశ్ర, నారాయణితో సహా తీర్థయాత్రలకు బయల్దేరిన వారం రోజులకు శ్యామ్‌బాబు పరిస్థితి చాలా అధ్వాన్నమైపోయింది. అతనిదగ్గర దమ్మిడీలేదు. ఇంట్లో వస్తువులన్నీ అయిపోయాయి. కొద్దిగా బియ్యంవుంటే, అవి ధర్మసూరిగారి కుటుంబాని కిచ్చేశాడు. వాళ్ళు పడుతున్న ఇబ్బందులు చూడలేక, తను ఆవాళ్టి నుంచి హోటల్లో నాలుగురోజులు భోంచెయ్యదల్చు[illegible] వాళ్లతో చెప్పాడు

[illegible] ఎక్కువ [illegible] ఇచ్చిన వ్యక్తి, శ్యామ్‌బాబుకు, ఒక కిళ్లీకొట్టువాడు మాత్రమే. అతనిపేరు వీర్రాజు. అతనికి శ్యామ్‌బాబును చూసిన దగ్గర్నుంచీ శ్యామ్‌బాబంటే ఒక రకమైన గౌరవం ఏర్పడింది. అతనివద్ద ఇరవై రూపాయలదాకా సిగరెట్లూ, సోడాలూ, శ్యామ్‌బాబు అరువు వాడాడు. ఇంకెక్కడా అరువు పెట్టడానికి శ్యామ్‌బాబుకు మనస్కరించలేదు. తక్కిన వాళ్ళు, అరువుపెట్టిన వాడిని గౌరవంగా చూడరు. అతన్ని లోకువగా మాట్లాడతారు. అప్పులవాళ్ల వల్లా, అరువు ఇచ్చిన వర్తకులవల్లా ధర్మసూరిగారి కుటుంబం ఎన్నెన్ని మాటలు పడుతున్నారో చూస్తే,

45-వ పేజీ చూడండి




### జరిగిన కథ

హాంబుర్గ్ నగరనివాసి ప్రొఫెసర్ లిడెన్‌బ్రాక్ ఒక పాత గ్రంథం సంపాదిస్తాడు. దానిలో ఒక త్వక్పత్రం దొరుకుతుంది

"ఆర్నె సాక్నుస్సెమ్" అనే ప్రాచీన శాస్త్రజ్ఞుడు, ఐస్‌లాండ్‌లో ఆరిపోయిన ఒక అగ్నిపర్వతం ముఖద్వారంలోనుంచి భూగర్భంలోనికి వెళ్ళినట్టు అందులో వ్రాసి ఉంటుంది తమ్ముడి కొడుకు ఆక్సెల్‌తో కలిసి ప్రొ॥ లిడెన్‌బ్రాక్ అక్కడికి ప్రయాణం కడతాడు. వారు హాన్స్ అనే గైడ్‌ను కుదుర్చుకుంటారు. స్కార్టారిస్ శిఖరం దిగువన వారికి మూడు రంధ్రాలు కనిపిస్తాయి. మధ్య రంధ్రంమీద స్కార్టారిస్ నీడ పడేవరకు కనిపెట్టుకొనిఉండి, నీడపడిన రోజున ఆరంధ్రంగుండా లోనికి దిగుతారు. కొంత దూరం వెళ్ళేసరికి వారికి రెండుదార్లు కనిపిస్తాయి. తూర్పువైపు సొరంగంలోంచి పోగాపోగా ఆదారి ఒకచోట ఆగిపోతుంది. పొరపాటు తెలుసుకుని వారు మళ్లీ రెండుదార్లు చీలినచోటుకు తిరిగివెళ్ళి, రెండవ సొరంగంలో ప్రయాణం కొనసాగిస్తారు. పోగా పోగా ఒక పెద్దగొయ్యి ఎదురవుతుంది. దానిలో [illegible] ఎనిమిది రోజులపాటు ప్రయాణం చేసిన తరువాత వారు ఒక విశాలమైన ప్రదేశానికి వస్తారు. అక్కడ విశ్రాంతి తీసుకుని మళ్లీ బయలుదేరుతారు. ముందు నడుస్తున్న ఆక్సెల్ దారితప్పి ఒంటరివాడవుతాడు. హాన్స్, లిడెన్‌బ్రాక్ తిరిగి అతణ్ణి స్పృహతప్పి ఉన్న స్థితిలో కలుసుకుంటారు వారు అతని గాయాలకు కట్లు కడతారు. ఆక్సెల్‌కి తిరిగి స్పృహవచ్చిన తరువాత ఎదురుగా కనిపించిన సముద్రంచూచి ఆశ్చర్యపోతాడు ప్రొఫెసర్ లిడెన్‌బ్రాక్ ఆ సముద్రంలో ప్రయాణానికి కావలసిన సన్నాహాలు హాన్సు చేత చేయిస్తాడు

## 32

ఆగస్టు పదమూడవ తేదీ పొద్దున్నే లేచాము. త్వరితముగా, ఉత్సాహముగా అయితే ఈ క్రొత్తరకపు ప్రయాణానికి సిద్ధమయ్యాము

రెండుకర్రలు కలిపి తెప్పయొక్క కూపము నిర్మించాము తెరచాపక్రింద కొయ్యకోసం మరొక కర్రముక్క వాడాము కంబళి ఒకదానిని తెరచాపగా మార్చాము త్రాళ్ళు గట్టివి అంతా గట్టిగానే ఉన్నది

ఆరు గంటలకు ఇక బయలుదేరవచ్చునని ప్రొఫెసర్‌గారు అనుమతి ఇచ్చారు సామానులు, పరికరాలు, ఆయుధాలు, కావలసినంత మంచినీరు 'పడవ'లో అంతకుముందే పెట్టాము

హాన్స్ మా తెప్పకు ఒక చుక్కాని కూడా ఏర్పాటు చేశాడు మా పడవని ఒడ్డుకి కట్టిఉన్న త్రాడు విప్పివేశాడు తరవాత వరిచేసి గబగబ కదిలి వెళ్ళిపోయాము.

ఆ చిన్న నౌకాశ్రయం వదిలిపోతూఉండగా మా పెదనాన్న దానికి పేరుపెట్టాలని నిశ్చయించి, నా పేరు సూచించారు.

41-వ పేజీ చూడండి





కింగ్‌సైజ్ సిగరెట్టిలా
షార్ట్‌గా పొడుగ్గా
ఆప్తమిత్రుల అభిప్రాయభేదంలా
సన్నగా లావుగ్గా
ఉండేవాడే విజయసారథులలో
సహారథి చక్రపాణి.

భాషకీ భావానికీ మధ్య వ్యాకరణలోకం
నెరపిన పాణినీయం మొటిది;
కళకీ కాసుకీ ఆ మధ్య
పెళ్లిచేసి చూపిన చక్రపాణీయం
సినిమా కలాటిది -

"అక్కా బావా అమ్మా నాన్నా
పాపా నేనూ బాబూ చిన్నా"
కలిసికట్టుగా చూసేటట్టు
(కాదుసుమా ఎబ్బెట్టు-బెట్టు)
సెన్సారస్పృక్షంగా తీస్తే
చాలునన్నదా శాస్త్రం గుట్టు -

అంటే, బంటి వెధవ
దిప్పకాయని కాదు -
ఐతే నన్ను బండోడితో సమమూ
అనకు -
సబబా? కాదు.



# భగ్న ప్రేమికుడు

## యర్రంశెట్టి శాయి

శేషగిరి పుస్తకం దీర్ఘంగా చదువుతున్నాడు.

రాజకొమార్తెని ఒక మాంత్రికుడు ప్రేమించేసి ఎత్తుకుపోవటం, ఒకరాజకొమారుడు ఆమెని వెతకటానికి బయల్దేరటం, మాంత్రికుని గుహ చేరుకోవటం, అక్కడ రాజకొమార్తె బందీయై ఉండటం చూసి ఆమెను విడిపించటానికి ప్రయత్నించడం — అక్కడ మాంత్రికుని మంత్రాలూ, మాయలూ, ఇక్కడివరకూ మామూలు హుషారుగా కథ శేషగిరి ఉండుండి "భలే" అనుకొంటున్నాడు. ఇంతలోనే అతని బుర్ర పనిచెయ్యటం మానేసింది. అతని దృష్టంతా ఒకమాట దగ్గర నుంచుండిపోయింది. తన కిష్టంలేని మాటలు కనబడితే తన బుర్ర పనిచెయ్యటం మానివేస్తుంది శేషగిరికి తెలుసు ఆ మాటని గట్టిగా పైకి చదివాడు "భగ్నప్రేమికుడు" భగ్నప్రేమికుడంటే ఏమైయుంటుందా అని ఒక అరనిమిషం ఆలోచించాడు ఏమాత్రం లాభంలేకపోయింది తన గురువుగారు కూడా ప్రేమంటే ఏమిటో అర్థం చెప్పారు. ప్రేమంటే అదొక పవిత్రమయిన "ఇది" అని కాని, మరి యీ భగ్నప్రేమికుడు అనే మాటకి ఏంచేతనో అర్థం చెప్పలేదే! భగ్నప్రేమికుడంటే ఒకవేళ గొప్ప ప్రేమికుడేమో! లేకపోతే ప్రేమంటే తెలియని పవ్యాపన్నా అవాలి "ఇదంతా ఎందుకు? గురువుగారిని కనుక్కొంటే పోతుంది కదా!" అనుకొన్నాడు గిరి అనుకోవడం తడవుగా వెంటనే తన పుస్తకం చేత్తో పట్టుకొని సైకిలు తీశాడు. ఆ సైకిలు నడుస్తూంటే వివిధ వాయిద్యాలూ మ్రోగుతున్న శబ్దం — రోడ్డుమీద నడిచే అందరి చెవులకీ ఇంపు గొలుపుతోంది

అతని గురువుగారు అప్పుడే "హోటల్" లోంచి బయటికి రావటం కనబడింది గిరికి. "గురో!" అని వెర్రికేకొకటి వేసి, రెండు యాక్సిడెంట్లు వెంట్రుకవాసిలో తప్పించుకొని, సైకిలుతో సహా ఆయన దగ్గరకు చేరుకొన్నాడు.

87—వ పేజీ చూడండి

# చదువుల్రావు



౨౦వ తేదీని 'ఇంటర్ కాలేజియెట్ 'ఎస్సే' పోటీలు జరుగుతాయి. ఈ వ్యాసరచన పోటీలో పాల్గొనే వారు స్టూడెంట్ యూనియన్ సెక్రటరీకి పేర్లు ఇవ్వాలి.
వ్యాసపు టాపిక్ మీద వ్రాయాలో తెలియజేయలేదు
వ్యాసం దేని మీద వ్రాయాలో తెలియజేయలేదు
కాగితం మీద వ్రాయాలనుకుంటానండి
సత్యమూర్తి




దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**16-3-1962 శుక్రవారము మొదలు**
**22-3-1962 గురువారము వరకు**

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

వీవవి తలపెట్టినా ముందు ఆర్థిక సమస్య ఎదురు అవుతూ ఉంటుంది శక్తికి మించిన ఆలోచనలను తగ్గించుకొనటం మంచిది కోర్టు కచేరీలలో మీ మాటకు విలువ బాగుంటుంది వృత్తిలో మీతో అన్నివిధాలా సహకరించగలవారు లభిస్తారు శుభవార్తలు తెలుస్తవి ఇతరుల వద్ద నుంచి రావలసిన డబ్బు ఆలస్యంగా మీ చేతికి వస్తుంది తరచూ మరచిపోతూ ఉండటంవల్ల బాధ్యతలు పెరిగే అవకాశా లున్నవి వారం రెండవ భాగంలో తెలిసే వార్తలు ఆశ్చర్యకరంగా ఉంటవి సాధారణంగా మీకంటే తక్కువ అంతస్థులో ఉండే మనుష్యులతో కలహాలు రాగల అవకాశా లున్నవి మీయందు అసూయాభావంతో మిమ్ములను లోతుకు దింపగల సలహాలు చెప్పేవా రుంటారు నిబ్బరంతో ఉండటం అవసరం 16, 17 లలో కార్యక్రమాలలో మార్పులు, అసౌఖ్య దోషము వృధా ఖర్చులు.

* • •

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ఒక విధంగా గౌరవం దక్కుతుంది కాని, అనేక రకాల కార్యక్రమాలను ఒకేసారి నిర్వహించవలసి వస్తుంది ఆదాయం మామూలుగా ఉంటుంది అకస్మాత్తుగా కష్టవార్తలు తెలుస్తవి సాధారణంగా ఈ సమయంలో వినోదసంబంధమైన ఖర్చులు అధికమవుతవి లోగడ మీవల్ల ఉపకారం పొందినవారు కూడా మీ వ్యవహారాలలో ప్రతికూలంగా మాట్లాడతారు ఆరోగ్యం ఇంతకు ముందు కన్నా మేలుగా ఉంటుంది కుటుంబ కార్యాలు చురుకుగా నెరవేరి మనస్సు కుదుటపడుతుంది ఖర్చులు మాత్రం అంచనాకు మించగలవు కాని, చిక్కులేకుండా సమర్థించుకొంటారు మాటలలో మిమ్ములను నిరుత్సాహపరచటానికి ప్రయత్నించేవా రుంటారు అధికారులవల్ల జరుగవలసిన పనులలో విదానం తప్పదు. 18, 19 లలో బంధువులవల్ల గౌరవం, కార్యసానుకూలం

| గ్రహస్థితి |
|---|
| కర్కాటకంలో రాహువు, మకరంలో శని కేతువులు, కుంభంలో అంగారక, బుధ, గురువులు, మీనంలో సూర్య, శుక్రులు, కర్కాటక, సింహ, కన్యలలో చంద్రుడు |

* * *

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

ఎన్ని ప్రతిబంధకాలు వచ్చినా మీ మాటకు అడ్డు అనేది ఉండదు ముందు కొంచెం శ్రమ మాత్రం ఉంటుంది ప్రయాణాలు చేయగలరు అయితే వెంటనే ఫలితం కనుపించలేదని అనుకోవద్దు వృత్తి వ్యాపారాలలో పెట్టుబడి పెట్టిన కొద్దీ సంతృప్తిగా ఫలితం పొందగల అవకాశా లున్నవి. మీ స్నేహితులలో ఎవరిని నమ్మటం, ఎవరిని నమ్మకపోవటం అనే సమస్య మిమ్ములను కొంతవరకు బాధించవచ్చు కుటుంబంలోనివారి ఆరోగ్యం మిమ్ములను కలవరపెట్టి క్రమంగా అనుకూలత కలుగుతుంది శ్రమ లేకుండా చట్టా వ్యాపారం వంటి పనులలో ధనం సంపాదించే యోచనలు పెట్టుకోదగిన సమయంకాదు పది మందికి సంబంధించిన కార్యక్రమాలలో మీ విలువ బాగుంటుంది వారాంతంలో తలవని తలంపుగా దేహబాధలు కనుపించగలవు 20, 21 తేదులలో అలంకారవస్తుప్రాప్తి, సంతోషవార్త

* * *

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఒకేసారి అత్యాశకుపోకుండా వీలయినంత వరకు ఫలితాన్ని సాధించుకొనటం అవసరం తరచు వృత్తిలో పోటీ కనుపిస్తుంది కలహ ప్రసంగాలు కూడా వస్తూ ఉంటవి కాని, మీ జాగ్రత్తవల్ల చాలవరకు సర్దుబాటుచేసుకోగలుగుతారు సాధ్యమైనంతవరకు డబ్బు కాని, రికార్డు కాని ఇతరులచేతికి పోకుండా చూచుకొనండి మీ ఆడంబరము, విశ్రాంతిలేని పనులు చూచేవారికి అసూయను కూడా కలిగించగలవు ఎవ్వరితోనూ దీర్ఘప్రసంగాలు పెట్టుకోదగిన సమయం కాదు కుటుంబంలో పరిస్థితులు మీ ఆలోచనలకు తగినట్లుగా అనుకూలిస్తవి ఆహార విహారాలలో సంతృప్తికరమైన అవకాశాలు లభిస్తవి దైవ కార్యాలయందు, సత్కాలక్షేపాలలోను మనస్సు కుదుటపడుతుంది సాహిత్య కృషి మొదలైన వాటిలో మధ్య మధ్య ఆటంకాలు కలుగవచ్చు 21, 22 లలో నూతన కార్యక్రమాలయందు ఆసక్తి, ఫలితాన్ని మించిన శ్రమ

* * *

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా )

ఈ సమయంలో మీరు ధైర్యాన్ని, చాకచక్యాన్ని ప్రదర్శించటం అవసరం అవుతుంది. వృత్తి ఉద్యోగాలలో తోటివారిని నమ్మి నిర్లక్ష్యంగా ఉండటం

మంచిదికాదు. ఎంత డబ్బు వచ్చినా చాలని పరిస్థితి ఏర్పడవచ్చు కుటుంబవిషయాలలోను, వ్యవహారరంగంలోనూ రహస్యాన్ని కాపాడుకొనండి మీ క్రింద పనిచేసేవారు చల్లగా మీ మాటను తిరస్కరించటానికి చూస్తారు మీ ఆరోగ్యం మాత్రం ముందు బాగుంటుంది మిమ్మలను మొహమాట పెట్టి సహాయం కోరే వారు ఉంటారు ఉత్తర దిక్కునుంచి సంతోష వార్తలు తెలుస్తవి సుబ్రహ్మణ్యస్తోత్ర పారాయణము, పూజ జరుపుకొనటం వల్ల వృత్తిలో ప్రతిబంధకాలు తొలగిపోతవి ధైర్యం లభిస్తుంది విద్యార్థులకు చికాకు, సందేహాలు అధికం అవుతవి 19, 20, తేదులలో శుభ సంబంధమైన ఖర్చులు, త్రిప్పట అధికం

* * *

## కన్య:

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ఇంతకుముందున్నటువంటి మనోభారం తగ్గుతుంది పదిమందియొక్క ఆదరము, కార్యరంగంలో సహాయ సంపదలు లభిస్తవి ధైర్యంతో ఒక సాహసం చేసి మీ ఆలోచనలను కార్యరూపంలోనికి తీసుకురాగలుగుతారు ఉష్ణ ఆధిక్యతవల్ల అసౌఖ్యం కనుపిస్తుంది ప్రయాణాలు ప్రస్తుతానికి ఆగిపోగలవు స్థిరాస్థులు మొదలయినవి కొనే సందర్భాలలో కొంచెం నిదానము, ముందు జాగ్రత్త అవసరం క్రొత్తవారితో పొత్తు కలవవలసిన సందర్భాలలో గ్రహబలం అనుకూలిస్తుంది కుటుంబంలోనివారి ఆరోగ్యం మధ్య మధ్య లోపిస్తూ ఉంటుంది ఎవరు ఏవిధంగా చెప్పిన చల్లగా మాట్లాడుతూ మీ విలువను కాపాడుకొన గలుగుతారు లలితకళలయందు అభివృద్ధికరంగా ఉంటుంది వ్యవహారసంబంధమైన బాధ్యతలు తీరి మీ మాట చలామణి అవుతుంది 17, 18తేదులలో కార్యరంగంలో ధైర్యము, ఇష్టవస్తుప్రాప్తి

* * *

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

ఎక్కడకు తగినట్లు అక్కడ పరిస్థితులను సమకూర్చుకొనగలుగుతారు దైవికంగా మీమీద బాధ్యత భారము, పడవలసిన అవసరం రాకుండా జాగ్రత్త వహించగలరు లోగడ చేసిన పనుల యొక్క ఫలము ఈ సమయంలో అనుకూలంగా తెలుస్తుంది సుఖసంతోషాల నిమిత్తం ధన వ్యయం చేస్తారు వస్త్రాలు, ఆభరణాలు మొదలైనవి కొనే అవకాశా లున్నవి బంధువుల వద్ద నుంచి వచ్చే వార్తలు మనస్సంతృప్తిని కలిగించవు బయటివారివల్ల గౌరవమర్యాదలతో బాటు ఆదాయం కూడా లభిస్తుంది మీకు ఇష్టం లేకపోయినా ఎదటివారి బలవంతాన్ని తప్పించుకొనలేక సాహసకార్యాలలో ప్రవేశించవలసి వస్తుంది పిల్లల ఆరోగ్యం బాగుండదు ఆదాయం బాగానే ఉంటుంది కాని, అధిక శ్రమవల్ల వారాంతంలో మీ ఆరోగ్యం లోపించవచ్చు వీలు అయినంత వరకు మిత ప్రసంగానికి అలవాటు పడటం అవసరం 16, 17 లలో శ్రమవల్ల కార్యసిద్ధి, శుభవార్త.

## వృశ్చికం !

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ )**

గ్రహబలం బాగున్నది మీ హోదా, సంఘంలో మీ స్థానము చక్కగా స్థిరపడగల సమయం ఆరోగ్య విషయంలో లోపం రాదు కాని, స్వల్ప కారణాలు కూడా మిమ్మలను అలజడి పెట్టవచ్చు పెద్దమనుష్యుల సహకారంతో అన్ని విధాలా అభివృద్ధిని సాధించగలుగుతారు ఇంతకు ముందు మీ ఆలోచనలను చులకనగా చూచిన వారు ఈసమయంలో మిమ్మలను గౌరవిస్తారు శుభకార్యప్రయత్నాలకు అనుకూలమైన కాలం ఆర్థికంగా మీ స్థితి చాలా బాగుంటుంది ప్రతివిషయంలోనూ మిత్రుల మాటనే నమ్మక స్వయంగా ఆలోచించుకొనటం కూడా అవసరం ప్రయాణ సూచన లున్నవి మీకు సంబంధించిన అన్ని సమస్యలను చురుకుగా పరిష్కరించుకొన గలుగుతారు దైవకార్యాలు నిరాటంకంగా జరుగుతవి 17, 18 తేదులలో వృత్తి ఉద్యోగాలలో అభివృద్ధి అకస్మాద్ధనలాభం

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

గౌరవప్రదమైన కాలం కాని, ఏదో ఒక రూపంలో శ్రమ, ధనవ్యయము పెరుగుతూ ఉంటవి గత కాలంలో జరిగిన సంఘటనలు మిమ్మలను చురుకుగా ముందుకు పోకుండా చేస్తుంటవి పిల్లల మూలంగా ఆనందం లభిస్తుంది మీరు ఎంత ప్రయాస పడినా ఎదటివారిని మెప్పించటం కష్టం అవుతుంది కుటుంబంలో సుఖ సంతోషాలు లభిస్తవి వృత్తివ్యాపారాలలో క్రమక్రమంగా మీ ధన గౌరవాలను అభివృద్ధి చేసుకోగలుగుతారు ఎప్పటికప్పుడు మీ కార్యక్రమాలను వాయిదా వేసుకొంటూ రావటంవల్ల ఈ సమయంలో విశేషంగా అలసటను భరించవలసి వస్తుంది వారం రెండవభాగంలో లాభ, శుభ వార్తలు తెలుస్తవి నౌకరులు మొదలయిన వారితో ఉద్రేకాన్ని కనబరచుకొనకుండా ప్రశాంతంగా మాట్లాడటం అవసరం విలువగల వస్తువులు పోగొట్టుకుంటారు 19, 20 తేదులలో ఆదాయ వృద్ధి, అధికారులవల్ల అనుకూలత

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

సాధారణంగా శ్రమ సూచనలు కనుపిస్తున్నా ముఖ్యంగా వ్యవహార చిక్కులనుంచి బయట పడ గలుగుతారు ఆర్థిక విషయంలో కూడా చాలవరకు మనశ్శాంతి లభిస్తుంది ముందుగా పెట్టుబడి పెట్టవలసి వస్తుంది కాని, దైవానుగ్రహంవల్ల చక్కగా నెరవేరుతవి రకరకాల మనుష్యులతో సంబంధం కలుగుతుంది ఈ సమయంలో న్యాయంకోసం పాటుపడగలుగుతారు అయితే "ఏ ఎండకు ఆ గొడుగు" అనే భావాన్ని కాపాడుకొనటం అవసరం. బంధువులవద్ద నుంచి సంతోషవార్తలు తెలుస్తవి ప్రసంగాలలో మీ మనస్సును వొప్పించగలవా రుంటారు వృత్తికి సంబం

## ఈ వారము ధరలు

ఈ వారం బంగారు ధర తగ్గే సూచన లున్నవి వెండి ధర మాత్రం నిలకడగా ఉంటుంది పసుపు ధర వారాంతంలో కొద్దిగా పెరుగుతుంది వేరుశనగపప్పు ధర పెరిగి తగ్గుతుంది నూనె ధర మామూలుగా నిలుస్తుంది నూవుల నూనె ధర కొద్దిగా పెరిగే అవకాశా లున్నవి ధాన్యము ధర తాత్కాలికంగా మందీ కనుపిస్తుంది మిర్చి ధరలో తేజీ వస్తుంది ధనియాల ధర స్థిమితంగా ఉంటుంది చింతపండు ధర వారం రెండవ భాగంలో తేజీ అవుతుంది కందుల ధరలో పెద్ద మార్పులు ఉండవు

ధించిన పనులు ఎప్పటికప్పుడు సులభంగా నెరవేర్చి జయం పొందగలుగుతారు గతవారంలో చేసిన పొరపాట్లు సమర్థించుకొనటంతో కొంతకాలం వృధా అయే సూచన లున్నవి. 21, 22 తేదులలో కారణం కనుపించని చింత, సౌఖ్యం నిమిత్తం ఖర్చు

* * *

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

మీ శక్తి సామర్థ్యాలను ఎంత వినియోగించినా మరొకరి సహాయం అవసరం అవుతుంది సకాలంలో నిద్ర, ఆహారము అమరకపోవచ్చు విశ్రాంతి లేకపోయినా పైవారి బెదిరింపులకు ఆందోళన చెందవలసిన అవసరం తొలగిపోతుంది ఆదాయంలో విశేషంగా మార్పులు కనుపించవు ఎప్పుడూ పదిమందిలో గౌరవస్థితిలో నిలబడ గలుగుతారు ప్రయాణాలు అనుకూలిస్తవి మీకు అభ్యాసం లేని వ్యవహార సంబంధమైన పనులలో అనవసరంగా ఖర్చులు పెరుగుతవి వారాంతంలో కుటుంబంలోనివారికి తలవనితలంపుగా అనారోగ్యం చేస్తుంది మీలో ఏదైనా కొంచెం లోపం కనుపిస్తే దానిని పెద్దగా ప్రచారం చేయటానికి ఎదురుచూచేవా రున్నారు జాగ్రత్తగా ఉండండి 20, 21 తేదులలో సంతోషవార్తలు, భాగస్థులవల్ల కార్యసిద్ధి

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ భాద్ర, రేవతి.)**

మీరు ఇంతకుముందు చేస్తున్న వృత్తి వ్యాపారాలలో మార్పులు రాగల అవకాశా లున్నవి అప్పులలో ఎడబాటు కలిగే సమయం విద్యా వినోద విషయాలలో ఆసక్తి, పాల్గొనే అవకాశాలు కూడా లభిస్తవి తాత్కాలికంగా అప్పులు చేయవలసిన అవసరం కలుగవచ్చు కుటుంబంలో ఇంతకు ముందు కలిగిన చికాకులు చల్లగా అణగిపోయి ప్రశాంతంగా ఉండగలుగుతారు అయినవారు కదా అని వారిమాటను నమ్మి ధైర్యంగా ఉండతగిన సమయం కాదు అధికారులతో మాట రాకుండా చూచుకొనండి ఖర్చులు మాత్రం అధికంగానే కనుపిస్తవి కాని, ఏదోవిధంగా అనుకున్న పని నెరవేరుతున్నదనే సంతృప్తి కలుగుతుంది. సంచారం మాత్రం అధికం 18, 19 తేదులలో అలసట, కలహాలు, వృత్తిలో పోటీ ఎక్కువ. ★

# మీరు ఎంత తొందరలో వున్నాసరే

# నీవియాను

# ఉపయోగించగలరు

నీవియా క్రీం అనేక విధాల ఉపయోగపడుతుంది, ఇది ప్రకృతికి అత్యంత సన్నిహితమైంది చర్మాన్ని ఇది మృదువుగా చేసి, పోషించి, రక్షిస్తుంది. ఇతర క్రీములు చేయలేని పనిని నీవియా చేస్తుంది—అలసి పోయిన గ్రంధులకు నవోత్తేజం కలిగిస్తుంది మీ చర్మాన్ని, కాంతంగా, ఆరోగ్యంగా, యవ్వనంగా వుంచుతుంది ఆమెకూ, అతనికీ, బేబీకి కూడా దాని సుకుమార రక్షణకు మించినది లేదు.




**కాంతివంతమైన చర్మానికి నీవియా సాటిలేనిది**



# హాస్యం లాస్యం



## సినీ సంసారం

నేను ఈ "ప్రపంచం" లోకి అడుగుపెట్టి 19 సంవత్సరాలు అయింది. ఒకసారి మా బంధువుల వద్దనుండి "పెండ్లిపిలుపు" వచ్చిం పెండ్లికి వెళ్ళాను కాని ఆ "పెండ్లిసందడి" లో నన్నెవరూ గమనించలేదు హలో రామచంద్రా అనుకుంటూ ఒకచోట కూలబడ్డాను అక్కడ కొంతమంది "పెండ్లికాని పిల్లలు" మాట్లాడుకుంటూ నవ్వుకుంటున్నారు వాళ్ళలో ఒక అమ్మాయి పేరు "శాంతి"ట. ఆ అమ్మాయి "నవ్వితే నవరత్నాలు" రాలుతున్నాయి. నేను అమాంతంగా ఆ అమ్మాయిని ప్రేమించేసి, ఎవరూ చూడనప్పుడు 'నిన్నే పెండ్లి చేసుకుంటా' నని "వాగ్దానం" చేసేశాను కొన్నాళ్ళకు మా పెళ్ళి నిశ్చయమై "పెళ్ళితాంబూలం" తీసుకున్నాము. మా పెళ్ళి వేడుకగా జరిగిపోయింది "బాటసారి" లా తిరిగే నాకొక సహధర్మచారిణి వచ్చింది

మా "సంసారం" చక్కగా సాగుతూ వచ్చింది."సంతానం"లేదనే కొరత లేకుండా "మాబాబు" పుట్టాడు. పెరిగి పెద్దవాడయ్యాడు కాలేజీచదువుల్లో దిగి ఒక కాలేజీ గర్ల్ "ప్రేమ" లో పడ్డాడు. ఆ అమ్మాయినిచ్చి వివాహం చెయ్యకపోతే "దేవదాసు" నవుతానని,"లైలా,మజ్నూ"లలాగ యిద్దరూ ప్రాణాలు విడుస్తామని బెదిరించాడు. మేము భయపడి ఆ అమ్మాయికి మావాడిచేత "మాంగల్యం" కట్టించాము. "పెళ్ళికానుకలు" చాలా వచ్చాయిలెండి! నూతన 'భార్యాభర్తలు', 'సంతోషంగా' కాలం గడుపుతూ వచ్చారు కొన్నాళ్ళకు వారికి వరుసగా 'ముగ్గురుకొడుకులు' పుట్టారు. ఇప్పుడు "తండ్రులు — కొడుకులు" సంతోషంగా వున్నాము. "శ్రీ వేంకటేశ్వరమహాత్మ్యం" వలన మాయిల్లు "నిత్యకల్యాణం పచ్చతోరణం"గా వుంది. ఇంక ఎక్కువవ్రాస్తే చదువరులకు విసుగురాదూ! అందుకు యింతటితో చాలిస్తా. ఇది చదివి "పెద్దమనుష్యులు" మీరంతా నవ్వుతున్నారా? నవ్వండి...

"అంతా మనవాళ్ళే"గా!

— మీనా, విజయ్ (హైదరాబాదు)

## ఔషధ ప్రభావం

వెంట్రుకలు నల్లబడాలని ఒకాయన "తెల్లవెంట్రుక లుండవు." అనే ఒక ప్రకటన చూసి ఆ మందు తెప్పించాడు. తలంతా రాగిచెంబు అయింది. పాపం! అంతకుపూర్వం ఆయనకున్న నల్లవెంట్రుకలు లేవు ఇప్పుడు...

భారవి (మేడచల్)

* * *

## భాగ్యశాలి

పుణ్యవంతుల పూజ చేయనివాడు,
పాపములను పరమ సంతోషముతో చేయువాడు,
భక్తులను బాధపెట్టువాడు,
ఆడుబిడ్డల సొమ్ము లపహరించువాడు
బ్రతుకుకొరకు దొంగపనులు చేయువాడు,
పేదల పొట్టగొట్టి పెరుగువాడు,
చుట్టము లాస్తులను చుట్టబెట్టువాడు,
అన్యకాంతలమీద నాశగలవాడు,
నీచకృత్యముల నవలీలగ చేయువాడు,
సాధు సజ్జనులను దిట్టువాడు,
నిరుపేదలను చూచి నిరసించువాడు,
పరుల ద్రవ్యముమీద భ్రాంతినొందువాడు,
దానమిచ్చుటయందు ధైర్యము లేనివాడు,
ఒరులు పచ్చగుండగ నోర్వలేనివాడు,
అబద్ధపు సాక్ష్యము లిచ్చుటం దాసక్తి గలవాడు,
బ్లాకులో బాగుగా బొజ్జ పెంచువాడు,
నక్క వినయములతో నయవంచన చేయువాడు,
తడిగుడ్డలతో గొంతుకులు కోయువాడు,
దుఃఖితులను చూచి దయచూపనివాడు,
ఓట్లకొరకు నోట్లు ఖర్చుపెట్టువాడు,
ఎవ్వడో! వానికే సమకూడు సమస్తైశ్వర్యములు,
సుఖశాంతు లీ ధరణిలోన నిక్కము సుమ్మీ!!

— వి. వి. నరసింహారావు (విజయనగరం)




"ఆ రోజున ఎసెంబ్లీలో నేను ఈ "విట్టు" చెప్పగానే అందరూ పొట్ట చెక్కలయ్యేలా గంటసేపు నవ్వేరు. అవునండా.. ఇంక..."



# చక్రాలు

డి. సూర్యప్రకాశరావు



నేనుండేది రాజమండ్రి. పనిమీద తరుచు అమలాపురం వెళ్ళివస్తూ ఉంటాను. ఆరోజు తెల్లవారుఝామున లాంచిఎక్కాను. బొబ్బర్లంక దగ్గరే సుబ్బారావు కనిపించాడు. అతన్ని చూసి చాలారోజు లయింది పనిమీద బొబ్బర్లంక వచ్చి కొత్తపేటకి తిరిగి వెళ్ళిపోతున్నానని చెప్పాడు. కుశలప్రశ్నలయిన తర్వాత ఒకర్నిగురించి మరొకరికి ఏమేమి చేస్తున్నామో చెప్పుకున్నాం. జరిగిపోయిన విషయాలు నెమరు వేసుకున్నాం. సుబ్బారావు వ్యవసాయం చేసుకుంటున్నాడు. నా వ్యాపారం గురించి చెప్పాను

ఇంతలో బస్సు హారన్ గట్టిగా మోగింది. "ఏమిటో! ఇప్పుడే బయల్దేరుతోందా ?", అన్నాను అటుతిరిగి

"అబ్బే! బయలుదేరటం కాదు, మన రాజు గారు" అన్నాడు సుబ్బారావు నవ్వుతూ

అయిదారుగురు చిన్న కుర్రాళ్ళు డ్రైవరు సీటు చుట్టూ మూగి ఒకరే హారన్ మోగిస్తూ సందడి చేస్తున్నారు. బస్సు డ్రైవరు కాలోబ సిగరెట్టు కాలుస్తూ ప్రక్కనే కూర్చుని నవ్వుతున్నాడు. అతన్ని నేనింతకుముందు చాలాసార్లు చూశాను. మనిషి దిట్టంగా జుట్టు నెరిసిపోయి, ఎప్పుడు చూసినా ఖాకీ నిక్కరు షర్టుతో కనిపిస్తాడు.

"అవునోయ్ సుబ్బారావు! ఇత డెప్పుడొచ్చినా పిల్లలు మూగుతారు. పిల్లల్ని, మిఠాయి వంటి పెడుతూ ఉంటాడు సరదా మనిషిలా గున్నాడే" అన్నాను.

"పాపం, సరదాగా కనిపించినా ....." అంటూ సుబ్బారావు సిగరెట్టు తీసి ముట్టించి నా కొకటి అందిచ్చాడు పొగ వదులుతూ "సరదాగా కనిపించినా ?" అన్నాను ప్రశ్నార్థకంగా

"అతనొక పెద్ద కథలే నాకు చిన్నప్పటి నుంచి తెలుసు. బస్సు బయలుదేరడానికింకా కొంతసేపుంది. అలా చెట్టుక్రింద కూర్చుందామా"

---

శ్రీ డి. సూర్యప్రకాశరావు ఫిబ్రవరి 27 వ తేదీన అకస్మాత్తుగా మరణించారని తెలుపడానికి విచారిస్తున్నాము. వారి వయస్సు 32 ఏళ్లు.

## చక్రాలు

కొందరు అప్పుడే బండి ఎక్కి కూర్చుంటున్నారు. కొందరు మాలాగే అక్కడక్కడ నుంచుని ఉన్నారు. చెట్టుకిందకి వెళ్లి కూర్చున్నాం

"ఈ ప్రాంతంలో గోపాల్‌రాజుని తెలియని వాళ్లు చాలా తక్కువమంది అతన్ని అసలు మా ఊరే వాళ్లది చాలా బీద కుటుంబం ఉన్న కొద్ది పొలంతోను పొట్ట నింపుకోటానికి చాలా యిబ్బంది పడేవారు అయినా రాజుని వాళ్ల తండ్రి స్కూల్లో చేర్పించాడు అతని చెల్లె లొకర్తె ఉండేది అన్నతమ్ములు లేరు రాజు మంచి తెలివి తేటలు కలవాడు మంచి మార్కులు తెచ్చుకునే వాడు కాని ఫోర్తుఫారం చదువుతూండగానే బడి మానేసి పనిలో చేరవలసి వచ్చింది వీళ్లని, వాళ్లని అడిగి క్లీనరుద్యోగంలో చేర్పించాడు చదువు మానేసినందుకు గోపాల్‌రాజు అట్టే బాధ పడ లేదు సంతోషంగానే ఉండేవాడు కష్టపడి పని చేసి డ్రైవర్ లైసెన్సు సంపాదించుకోవాలని అతని ఆశయం అతని కొచ్చే జీతంరాళ్లతో తండ్రి వ్యవసాయంతో ఎలాగో పొట్టపోషించుకునేవారు. గోపాల్‌రాజుకి ఒక చెల్లెలుండేదని చెప్పాను కదూ. ఆ అమ్మాయికి పెళ్లీడు వచ్చింది కాని పాపం మంచి సంబంధమొకటీ కుదరలేదు ఇలా ఉండగా గోపాల్‌రాజు తల్లి జబ్బుచేసి పోయింది. దగ్గిర బంధువులున్నా వరాన్వేషణకు తోడ్పడేవా రెవరూ లేకపోయారు ఈ దెబ్బతో గోపాల్‌రాజు తండ్రి బాగా చితికిపోయాడు కుటుంబ భారం చాలామట్టుకు మనరాజు మీదే పడింది స్నేహి తుల సహాయంతో నైతేనేమి, మరేలాగైతేనేమి చెల్లెలు సీతకి సంబంధం చూశాడు రాజమండ్రిలో ఒక వర్క్‌షాపు నడుపుతూన్న సత్యన్నారాయణ రాజు కొడుక్కి కుదిర్చాడు అనుకున్నట్టే పెళ్లి జరిగిపోయింది"

సుబ్బారావు సిగరెట్టు అవతలకి పారేసి గోపాల్ రాజు నుల్చున్న వైపు పరధ్యాన్నంగా చూశాడు. రాజు చుట్టూ ఉన్న పిల్లలమూక పెరిగిపోయింది. దానికి కారణం లేకపోలేదు ఒక పొట్లంలోంచి బిళ్లలు తీసిపెడుతున్నాడు పిల్లల అరుపులతో, కేకలతో సందడిగా ఉంది రాజు ముఖం పరీక్షగా చూశాను అంతదూరంనుంచి అతని ముఖం మీద విచారరేఖలు చూడగలిగాను సుబ్బారావు తిరిగి చెప్పడం ప్రారంభించాడు

"అయితే ఇక్కడ కథ మారిపోయింది తమకు ముట్టవలసినవి ముట్టలేదని సీత మామగారి వైపు వాళ్ళు పేచీ పెట్టారు రాజు తండ్రి ఎటూ పనికి రాకుండా పోయాడు వాళ్లకి నచ్చజెప్పే భారం రాజుమీద పడింది కాని అతను ఏమీ చేయలేక పోయాడు సీత కాపరానికి వెళ్లే అవకాశం సన్న గిల్లిందని తేలింది ఇంతలో రాజు ఆశయం ఒకటి నెరవేరింది అనుకున్న ప్రకారం డ్రైవింగ్ లైసెన్సు సంపాదించుకున్నాడు కొంతకాలానికి డ్రైవరుగా ప్రమోషను కూడా వచ్చింది ఆదాయం పెరిగింది, దాన్ని పురస్కరించుకుని చెల్లెలు

కాపురం సరిపెడదామని ప్రయత్నించాడు అతని ప్రయత్నం సఫలమవలేదు

కొన్ని సంవత్సరాలు గడిచాయి నేను రాజమండ్రి కాలేజీలో చేరాను రాజా కుటుంబ వ్యవహారాలు తెలుసుకుంటూనే ఉన్నాను డ్రైవరుగా మంచి పేరు పొందాడు బస్సు ఓనర్లు సైతం అతనిపట్ల మంచి అభిమానం చూపేవారని విన్నాను సీత విషయమై దిగులుపడి పెడదారి త్రొక్కాడు త్రాగుడు అలవాటు చేసుకున్నాడు ఒకనాడు త్రాగి ఆవేశంలో చెల్లెలు మొగుడు మీద రెచ్చిపోయాడు పెద్ద గొడవ జరిగింది తెలిసినవాళ్ళు నలుగురు గట్టిగా మందలించారు ఈ సంఘటనవల్ల చెల్లెలి కాపురం మరికొంత చెడడం తప్ప జరిగేదేమి వేరేలేదని చెప్పారు తండ్రి కూడా కోప్పడ్డాడు రాజా వినిపించుకో లేదు వీలైనప్పుడల్లా చెల్లెలి మావగారి వద్దకు వెళ్ళి కేకలేసి వచ్చేవాడు"

బస్సు హారన్ తెగమోగిపోతుంది పిల్లల నవ్వులు, కేకలు సహితం అధిక మయ్యాయి సుబ్బారావు చెప్పుకుపోయాడు

"రాజాకి పెళ్ళి సంబంధాలు రావడం మొదలు పెట్టాయి ముందు పెళ్ళి అనవసరమనుకొన్న వాడు చివరికి ఒప్పుకున్నాడు దూరపు బంధువు అమ్మాయినే చేసుకున్నాడు పెళ్ళయిం తర్వాత రాజా త్రాగుడు తగ్గిస్తాడని ఎదురుచూశారు ఇది జరుగలేదు కాని బావగారితో పోట్లాటలు తగ్గుతూ వచ్చాయి రాజా భార్య వాళ్ళని ఎలాగైనా మంచి చేసుకుని సాధించాలి గాని తగువు పెట్టుకుని లాభంలేదని నచ్చచెప్పింది ఆమె మాటలు పురస్కరించుకొని రాజా కూడా బావ గారికి నచ్చచెప్దామని ప్రయత్నించాడు అతను తండ్రికి జడిసి నిస్సహాయుడుగానే ఉండి పోయాడు."

ఇంతలో బస్సు బయల్దేరే సూచనలు కనిపించాయి

"బస్సులో మాట్లాడుకుందాంలే" అని సుబ్బారావు లేచి నుంచున్నాడు బస్సు ఎక్కేముందు సుబ్బారావు రాజాని పలకరించాడు రాజా అదో రకంగా నవ్వి వూరుకున్నాడే గాని మాట్లాడ లేదు సుబ్బారావు నావైపు సార్థకంగా చూశాడు

పెళ్ళయిన తర్వాత రాజా, నేనూ అట్టే కలిసే వాళ్ళంకాదు చిన్నప్పటినుంచి తెలిసినవాడు కాబట్టి అతన్ని గూర్చి వార్తలు మాత్రం వింటూ ఉండేవాడిని "సుబ్బారావు సిగరెట్టు వెలిగించడానికి కథ చెప్పడం ఆపాడు బస్సు మంచి వేగంతో సాగిపోతోంది దారిలో పిల్లలమూక కనిపిస్తే సరి రాజు హారన్ విపరీతంగా మ్రోగించేసేవాడు వాళ్ళ కేరు అరుపులతో సమాధాన మిచ్చేవారు ఈ ప్రాంతంలో పిల్లలందరికి రాజా సుపరిచితుడు

"ఒకనాడు బాగా త్రాగేసి రాజా రాజమండ్రికి వెళ్ళాడు రాత్రికి కూడా ఇంటికి తిరిగి రాలేదు అదే సాయంత్రం అతని భార్య పరుగెత్తుతున్న దూడను పట్టుకోబోయి ఒక లారీ క్రింద పడింది తీవ్రమైన గాయాలు తగిలాయి డాక్టరువద్దకు తీసుకెళ్ళారు. కాని, పాపం ఆ రాత్రే చచ్చిపోయింది

రాజాకి విషయం మర్నాడు మధ్యాహ్నానికి కాని తెలిలేదు "బస్సు హఠాత్తుగా ఆగింది ఎవరో పిన్న కుర్రాడు అడ్డంగా పరుగెతటంవల రాజా సడన్ బ్రేకు వేశాడు పిదోవిధంగా కండక్టరు ప్రయాణికులు కొందరు తలలు బైటికి పెట్టి కేకేశారు చిన్నపిల్లలు మూలంగా జరిగే కొన్ని ప్రమాదాలు కొందరు విశదీకరించారు రాజా మాత్రం మాట్లాడనైనా లేదు బస్సు మళ్ళీ ముందుకు సాగిపోయింది

"ఇదే కొంతకాలం ముందు జరిగితే రాజా అరుపులకంతు ఉండేదికాదు" అన్నాడు సుబ్బారావు నెమ్మదిగా

"రాజా తప్పేమీ లేకపోయినా కొంద రతన్ని కేకలేశారు తండ్రి నిష్ఠూరంగా మాట్లాడాడు అతని త్రాగుడే చెల్లెలి సంసారం చక్కబడకుండా ఉండటానికి కారణ మన్నారు రాజా తిట్లన్ని పడి వూరుకున్నాడు అతన్ది పెద్ద ఆదర్శమైన దాంపత్యం అని అనలేము అయినా భార్య మరణం అతన్ని పూర్తిగా మార్చేసింది ఆనాటినించి ఇలా అయిపోయాడు త్రాగటం మానేశాడు బస్సు దగ్గర కొస్తేనే కసురుకునేవాడు చిన్నపిల్లల్ని చేరదీయటం ప్రారంభించాడు ఈ చుట్టు ప్రక్కల కనీసం అతని పేరైనా వినని చిన్నపిల్లలుండరు

"సీత కాపురం చక్కబడిందా ? చేస్తే ఇదొక కథలా గుండేది కానైతే అటువంటిదేమీ జరుగ లేదు ఆ అమ్మాయి మావగారి వైపు వాళ్ళ తమ పంతం వదులుకోలేదు" సుబ్బారావు ఈ వాక్యంతో రాజా కథ చెప్పటం ఆపేశాడు

ఏమనాలో తోచక నేను "పాపం" అని పూరుకున్నాను

ఆ పైన మా సంభాషణ వెరే విషయాల పై జరిగింది. సుబ్బారావు నన్నొకసారి వాళ్ళింటికి రమ్మన్నాడు. నేనతణ్ణి రాజమండ్రిలోమా ఇంటికి ఆహ్వానించాను

రాజమండ్రికి తిరిగి వచ్చేసిన వారం పది రోజుల వరకు నా పనితో మునిగిపోయాను ఒకరోజు తీరిక చూసుకుని సుబ్బారావుని చూద్దామని కొత్తపేట బయలుదేరాను ఆవేళ రాజా డ్యూటీలో ఉన్నట్టు లేదు అయినా నే నతని సంగతి మర్చిపోయాననే చెప్పాలి బస్సు ఎక్కిం తర్వాత డ్రైవర్ సీటు వంక చూసినప్పుడు ఈ సంగతి నా భావనలో ఒక క్షణం మెదిలింది ఇంతలో మా ఖాతా దారొకాయన తటస్థపడి నా ప్రక్కనే వచ్చి కూర్చున్నాడు దైనిక వ్యవహారాల వివరాలలో మునిగిపోయాం

ఆపూట నాకు సుబ్బారా వింట్లోనే భోజనం. భోజనానికి కూర్చునేటప్పుడు అనాలోచితంగా "ఇవాళ మన రాజా డ్యూటీలో లేడేమిటి ? కనిపించలేదే !" అన్నాను

సుబ్బారావు వెంటనే జవాబివ్వలేదు కొన్ని క్షణాల తర్వాత "భోజనం కానీ చెప్తా !" అన్నాడు వడ్డన ప్రారంభ మయింది సుబ్బారావు నన్ను కనుక్కోవటంలో మాట మారిపోయింది

భోజనానంతరం అరుగుమీద చాప వేసి కూరు'న్నాము "అదుగో ఆ ముసలతనే రాజా తండ్రి'" అన్నాడు సుబ్బారావు హఠాత్తుగా నే నటు చూశాను చుట్ట కాలుస్తూ కర్రపట్టుకుని అప్పుడే సందు మలుపు తిరిగి పోతూన్న ఒక సన్నటి వృద్ధుడు కనిపించాడు తలపాగా కింద జుట్టు బాగా నెరిసిపోయింది

"అలాగా !" అన్నాను అతనికి రాజాకి పోలికేమీ కనుపించలేదు



# చక్రాలు

"కూతురు సంసారం బాగుపడ్డ తర్వాత సగం బలం వచ్చింది పాపం!" సుబ్బారావు స్వరంలో ఒక చిత్రమైన భావం స్ఫురించింది సిగరెట్టు పొగ వదుల్తూ పరధ్యాన్నంగా రాజా తండ్రి పోయిన దిక్కు చూస్తున్నాడు

"రాజాకి పూర్తి బలం వచ్చేసిందా?" అని నవ్వాను ఈ చలోక్తికి సుబ్బారావు చిరునవ్వైనా నవ్వలేదు ఆఖరికి నావేపైనా తిరిగి చూడలేదు అతను ముఖభావం నన్ను మళ్లీ వెంటనే మాట్లాడకుండా చేసింది

"అవును! సీత సంసారం చక్కబడిందంటే రాజాకి సంతోషమే!" మా మధ్య తిరిగి మౌనం ఆవరించేసింది

"పెళ్లాం పోయిం తర్వాత త్రాగుడు మానేశాడని నీకు బస్సులో చెప్పినట్టు జ్ఞాపకం, రాజ మంద్రిలో తన దోస్తుల్ని కలిసినప్పుడు కూడా కష్టపడి నిగ్రహించుకునేవాడు కొంతకాలం పోతే వాళ్ల సహవాసమే తీరిపోయి ఉండేది అయితే ఒకనాడు ఏమయిందో కాని రాజా మళ్లీ త్రాగాడు

"త్రాగడం కూడా మితిమీరిపోయిందట. అతను అతనితోపాటు అతని స్నేహితు లిద్దరు తప్ప త్రాగేశారు ఆ మైకంలో రాజాకి చెల్లెలి భర్త వైపు వారి కాఠిన్యం గుర్తుకొచ్చింది కోపంతో రెచ్చిపోయాడు బావగార్ని, అతని కుటుంబాన్ని నాశనం చేస్తానని శపథం ఎట్టాడుట అతని మిత్రద్వయం ఆ తీర్మానాన్ని బలపరచారుట ముగ్గురు కలిసి రాజా బావగారిని ముందుగా హత మార్చాలని నిశ్చయించారుట వారిలో ఒకడు పెద్ద స్పానర్ తీసుకొని రాజా చెల్లెలు భర్త ఇంటికి బయలుదేరుదాం అన్నాడుట కాని ఆ స్థితిలో కూడా ఇది సాధ్యంకానిపని అని గ్రహించి నట్టున్నాడు చీకటి పడింతర్వాత రాజా బావ షాపు నుంచి ఇంటికి తిరిగి పోతున్నప్పుడు దారి కాయటానికి నిశ్చయించారు

"అంతపనీ చేశారు మసకగా ఉన్న ఒకచోట చెల్లెలి భర్తని ఆపారు అతన్ని బలవంతంగా ఆపి తిట్టిపోశారుట చిన్న పోట్లాట జరిగినట్టుంది స్పానర్ చేతబట్టిన రాజా మిత్రుడు అతని బావ తల పగులగొట్టటానికి ఉపక్రమించాడుట ఇంతలో రాజా ఏమనుకున్నాడో సీత భర్తని అవతలకి త్రోసివేసి తన సహచరులకు ఎదురు తిరిగాడుట

చెల్లెలి మొగుడు తలకని నిర్దేశించబడిన ఆ ఇనప స్పానరు బలంగా రాజా శిరస్సు తాకింది అక్కడే కూలిపోయాడట దానితో అతని స్నేహితులు భయపడిపోయి పోట్లాట ఆగిపోయింది ఈ సందడికి చుట్టుప్రక్కలవారు రానే వచ్చారు"

"రాజాకి మళ్లీ స్పృహరాలేదు ఆస్పత్రిలో చనిపోయాడు సీత భర్త ఏమనుకున్నాడో భార్యని ఇంటికి తీసుకెళ్లటానికి నిశ్చయించుకున్నాడుట రాజా అడ్డుపడటం వల్లనే కొడుకు బ్రతికిపోయాడని తెలుసుకున్న తల్లిదండ్రులు అడ్డు చెప్పలేదు"

సుబ్బారావు కథ ముగించాడు. దూరంగా బస్సు హారన్ మ్రోత వినిపించింది. ☆

# భగ్న ప్రేమికుడు

26వ పేజీ తరువాయి

"ఏమిరా! శిష్యా!" అన్నాడు గురువు మళ్ళీ "హోటల్"లోకి దారితీస్తూ ఆయన్ననుసరించాడు గిరి ఇద్దరూ కాఫీలు త్రాగారు "ఒక చిన్న అనుమానం గురో! నువ్వు ప్రేమంటే ఏమిటో చెప్పావుగాని మరి భగ్నప్రేమికుడంటే ఏమిటో" నసిగేశాడు గిరి

"హ్హా హ్హా హ్హా" అంటూ పగలబడి నవ్వేశాడు గురువు

"ఏమిటిరా! రాఘవా! ఎందుకలా నవ్వుతావు" అంటూ కోపంగా అడిగాడు గిరి గిరికి గురువుమీద కోపమొచ్చినపుడల్లా పేరుపెట్టి పిలిచేస్తూంటాడు

ఈ సంగతి గ్రహించేశాడు గురువు రుమాలు తీసి మొహం తుడుచుకొని మొదలెట్టాడు "భగ్నప్రేమికుడి"కి అర్థం చెప్పటం,

"వినరా శిష్యా విను! చెప్తా — అన్నట్లు దక్షిణ తెచ్చావా?"

బయటకు పరుగెత్తుకెళ్ళి కిళ్ళీకొట్లో ఒక బర్కిలీ పెట్టెకొని గురువుగారి కందించాడు శేషగిరి సిగరెట్టును వెలిగించిన తరువాత "అది ఇక్కడ చెప్పాల్సిన విషయం, కాదోయ్! పద! మా గార్డెన్‌లోకి వెడదాం" అంటూ లేచాడు గురువుగారు

ఇద్దరూ చెరో సైకిలుమీద గురువుగారి ఇల్లు చేరుకొన్నారు తోటలో చాలాదూరం నడిచి ఒక సిమెంటు బెంచీ మీద కూర్చున్నారు

"శిష్యా! చెబుతున్నా విను! భగ్నప్రేమికుడనేది ఒక గొప్ప బిరుదులాంటిది నిజంగా మన దేశంలాటి దేశానికి ఇటువంటి భగ్న ప్రేమికులు చాలా అవసరం ప్రతి దేశంలోను, ప్రతి సంవత్సరం ఈ భగ్నప్రేమికులవలన బోలెడు జనాభా తగ్గుతోంది అందుచేత కొన్నిచోట్ల ఈ భగ్న ప్రేమికులకు మంచి ప్రోత్సాహం లభిస్తోంది నిజంగా దాని మహాత్యం చాలా గొప్పది

"విరహం కూడా సుఖమే కాదా!" అన్నారు ఒకరు

ప్రేమ భగ్నమవటం కూడా సుఖమే కాదా!" అన్నారు మరొకరు

కాబట్టి భగ్నప్రేమికుడవటానిగ్గూడా పూర్వజన్మ సుకృతం కొంతుండాలి ఇహ అసలు భగ్న ప్రేమికుడంటే ఏమిటో చెప్తా! నువ్వు ఒహఅమ్మాయిని మరీ గాఢంగా కాకపోయినా, ఒక మోస్తరుగానైనా ప్రేమించావనుకో! అప్పుడా అమ్మాయికి మరొకరితో వివాహమయిపోయిందనుకో! అప్పుడు నువ్వు భగ్నప్రేమికుడు వన్నమాట! అదీ సంగతి" అంటూ ముగించాడు గురువుగారు

"ఆ! ఇందులో గొప్ప కథుందన్నమాట!" ఆశ్చర్యపోయాడు గిరి

"ఇంకా వుంది నీకు వినే ఓపిక ఉంటే?" అన్నాడు గురువు శేషగిరి వాలకం చూసి

"చూడు! అందుకనే అనేకమంది భగ్న ప్రేమికులైపోతున్నారు అలా అవటంమూలాన అనేక లాభాలు గూడా ఉన్నయి కొంతమంది ఆ భగ్న ప్రేమ మూలాన అమాంతం కవులయిపోయి పెద్ద పేరు దెచ్చుకొన్నారు ఇంకొంతమంది ఆత్మహత్య చేసుకొని ఇంకా పెద్ద పేరు సంపాదించేసుకున్నారు ఆ తరువాత యిదిగో చూడు! ఈ చిన్న రహస్యం విను! మళ్ళీ ఎవరి దగ్గరన్నా అనేవు సుమా! మరేంలేదూ, బోలెడు డబ్బులు కూడా కలిసొస్తయి ఉదాహరణకి క్రాపూ, గడ్డం భగ్న ప్రేమికుడు చేయించడు కదా! మరి ఆ ఖర్చు తగ్గదూ! ఆ తరువాత బట్టలు కూడా మాసినవి వేసుకోవడం మూలాన లాండ్రీకి డబ్బులు ఇవ్వక్కర్లేదు కాబట్టి శిష్యా అదీ మరి సంగతి! ఇహ వెళ్దామా!"

ఇద్దరూ నడవడం మొదలెట్టారు

"గురో!" అన్నాడు శేషగిరి

"ఊ!" అన్నాడు గురువు ఏమిటో మనవి చేసుకోమన్నట్లు

"మరీ" నసిగాడు గిరి

"ఫరవాలేదు చెప్పవోయ్!"

"మరీ, నేనూ వో భగ్నప్రేమికుడవాలనుంది గురో!"

"నిరభ్యంతరంగా అయిపోరా శిష్యా!"

"ఎలా గ్గురూ! ఎవర్నన్నా ప్రేమించొద్దూ!"

"ప్రేమించవోయ్! అదీ నేనే చెప్పాలీ!"

"అదేనండి గురూజీ! ఎవర్ని ప్రేమించనూ అని"

"మీ యింటి కెదురుగా ఉన్న సిలకశాస్త్రుర్లుగార్ని ప్రేమించు"

"ఛా!"

"లేకపోతే ఏమిటోయ్! కాస్త ముక్కూ మొగం సరిగ్గా ఉన్న దనుకొన్న అమ్మాయిని చూసి ప్రేమించిపారెయ్యక!"

"సరే! ప్రేమించి మళ్ళీ మిమ్మల్ని కలుస్తానండి!"

"భగ్నప్రేమ ప్రాప్తిరస్తు!"

శేషగిరి ఇంటి కొచ్చేశాడు అతని బుర్రంతా వేడెక్కిపోయింది

"ఎవర్ని ప్రేమించాలి?" పచార్లు చేసేస్తున్నాడు గిరి

"భోజనానికి రారా గిరి!" అంది బామ్మ!

"హా కొద్దుపో!" అంటూ కసురుకున్నాడు గిరి

మాంచి విసురుగా పచార్లు చేసేస్తున్నాడు "అవును! పాలుపోసే వెంకటలక్ష్మిని ప్రేమిస్తేం ఏం?" అనుకొన్నాడు గిరి

"అమ్మ బాబోయ్!" అంది గిరి అంతరాత్మ

"ఏం?" అన్నాడు గిరి

"ఒకసారి వెంకట్రావుగాడు ఆ అమ్మాయి నేదో అన్నాడని వాళ్ల అన్నయ్య వచ్చి వాణ్ని చితగ్గొట్టేశాడు గుర్తులేదూ!" అంది అంతరాత్మ

"అవును" అనుకొన్నాడు గిరి "మరెవర్ని ప్రేమించాలి?"

పచార్లు ఆపి కుర్చీలో కూలబడ్డాడు గిరి మొఖంమీద చేతు లుంచేసుకుని తీవ్రంగా ఆలోచించసాగాడు.

# భగ్నప్రేమికుడు

"గిరీ! అమ్మమ్మ ఎక్కడి కెళ్ళింది?" సన్నని కంఠం విని కళ్ళు విప్పాడు గిరి

అతని కళ్ళ కెదురుగా చిట్టెమ్మ బ్రహ్మాండంగా అలంకరించుకొని నుంచుంది చిట్టెమ్మ గిరి ఇంటి ప్రక్క యింట్లో ఉన్నవారి అమ్మాయి గిరి బామ్మని అమ్మమ్మా అంటూంటుంది గిరితో చాలా బాగా మాట్లాడుతుంది

"ఎందుకలా చూస్తావ్? ఇంతగా అలంకరించుకొన్నాననా? ఇవాళ నా పుట్టినరోజు కదూ! అందుకని" అంటూ ఒకసారి నవ్వేసి వెళ్ళిపోయింది చిట్టెమ్మ

"ఉండుండు" అన్నాడు గిరి

లోపల్లోపల "అవును చిట్టెమ్మను ప్రేమిస్తే ఏం?" అన్న ఊహ వచ్చేసింది గిరికి

వెంటనే ప్రేమించేశాడు కూడా

"ఏమిటి?" అంది చిట్టెమ్మ గిరి వంక విచిత్రంగా చూస్తూ

"మరేంలేదూ! అమ్మమ్మతో ఏవిటీ పని?"

"ఏవీలేదు! వూరికే!"

"మరి వెళ్ళిపోతావేం? కూర్చో వస్తుంది!" అంటూ ఎదురుగా ఉన్న కుర్చీ చూపించాడు.

కుర్చీలో కూర్చుంది చిట్టెమ్మ

ప్రేమించిన అమ్మాయిలతో ఎలా మాట్లాడాలో గురువుగారు చెప్పారు కాని వెధవది గుర్తుకొచ్చి చావడంలేదు "ముందస్తుగా ఆ అమ్మాయిని పేరుపెట్టి మృదువుగా పిలువ వలెను తరువాత" బట్టీ పట్టిన ముక్కలు, అక్కడవరకే గుర్తున్నాయి ఆఖరిమాట కూడా గుర్తుంది. అదేమిటంటే "ఆఖరిసారిగా" నీవే నా సర్వస్వం!" అనవలెను "ముందుస్తుగా పేరుపెట్టి పిలుద్దాం" అనుకొన్నాడు గిరి

అనుకొన్న వెంటనే "చిట్టెమ్మా!" అన్నాడు మృదువుగా!

"ఊ! ఏమిటి!"

"మ .. రి మ .. రీ ." తడబడిపోయాడు గిరి

"ఊ! మరి?"

"మరి! ఇవ్వాళ నీ పుట్టినరోజన్నావు కదూ!"

"అన్నాను!"

"నీకు నేనో బహుమతి ఇవ్వాలనుకొంటున్నా!"

"ఏవిటది?" సిగ్గుపడుతూ అడిగింది చిట్టెమ్మ

"ఇప్పుడు చెప్పను" అన్నాడు ఏమివ్వాలో తెలియక

"పోనీలే!" అంటూ లేచి వెళ్ళిపోయింది చిట్టెమ్మ

"అమ్మయ్య! ప్రేమించాను" అనుకొన్నాడు గిరి గుండెలమీద చేయి వేసుకొని

వారం రోజులు గడిచిపోయినై ఈ వారం రోజుల్లోనూ గిరి చాలా మారిపోయాడు చిట్టెమ్మతో హుషారుగా మాట్లాడటం మొదలెట్టాడు. చిట్టెమ్మ మీద పాటలు కట్టేశాడు. తను సెప్టెంబరు పరీక్షల కెడుతున్న పుస్తకాలన్నిటి మీదా "చిట్టెమ్మ" అని వ్రాశేశాడు అక్కడితో వదలక వాళ్ళ బామ్మ విశల్‌కోటి పుస్తకంతో కూడా "చిట్టెమ్మ" అని వ్రాసేశాడు.

"ఇహను ఫరవాలేదు! తను ప్రేమించేశాడు! భగ్నప్రేమికు డవటమే తరువాయి!" అనుకొన్నాడు

చిట్టెమ్మకు పదిహేను రోజులలో పెళ్లి అన్న సంగతి బామ్మ నోటవిని ఎగిరి గంతేశాడు గిరి తను భగ్నప్రేమికుడు అయిపోయే రోజు దగ్గర కొచ్చేస్తోంది చిట్టెమ్మని ఎవరో డాక్టరు చదువుతున్నాట్ట! అతని కిచ్చి చేసేస్తున్నారు

గురువాజ్ఞ ప్రకారం అప్పట్నుంచే గడ్డం పెంచటం మొదలెట్టాడు గిరి తరువాత రెండ్రోజులకి అనాడు గిరి చావిట్లో కూర్చొనుండగా చిట్టెమ్మ అతని దగ్గర నుంచుని అంది" 'ఏమిటీ అవతారం ?" అని

గురువు చెప్పిన విషయాలు గుర్తుకు తెచ్చుకుంటూ "మూణ్ణాళ్ల ముచ్చట" అన్నాడు గిరి

"ఏమిటి ?" అంది చిట్టెమ్మ ఆశ్చర్యంగా గిరి వంక చూస్తూ.

"జీవితం!" అన్నాడు గిరి.

"ఏడిశావ్! భోజనానికి లే!" అంది బామ్మ గిరికి బామ్మని చూస్తే వళ్లు మండిపోయింది ప్రియురాలితో ఆమె పెళ్లి అయిపోక ముందు ఎలా మాట్లాడాలో గురువుగారు నేర్పిందంతా ఈ బామ్మ రావటంతో నాశన మయిపోయింది అనుకొన్నాడు

"నా కొద్దు! ఫో!" అంటూ గట్టిగా అరిచేసి లేచి వెళ్లి భోజనం ముందు కూర్చున్నాడు

ఆ సాయంత్రమే పరిగెత్తుకుంటూ గురువు ఇంటికెళ్లిపోయి జరిగిన సంగతంతా చెప్పేసి "ఏం చెయ్యమంటావు గురూ!" అంటూ ప్రశ్నించాడు.

"మరేమీలేదు ఆ అమ్మాయి నిన్ను ప్రేమించటానికి ఎలాగూ ఒప్పుకోదు గదా!" అన్నాడు గురువు.

"ఏమైనా సరే ఒప్పుకోదు గురూ! ఎందుకంటే ఆ అమ్మాయికి పెళ్లి స్థిరమైపోయింది ఆ తరువాతేమో పెళ్లికొడుకు బాగా డబ్బూ, అందం ఉన్నవాడు. పైగా డాక్టరు చదువుతున్నాడాయె ఇంక నన్ను ఎలా ప్రేమిస్తుంది ?"

"అట్లాయితే రేపో, ఎల్లుండో ఆ అమ్మాయిని ఎక్కడైనా ఒంటరిగా కలుసుకో! అప్పుడు 'నిన్ను ప్రేమిస్తున్నాను' అని చెప్పెయ్యి! "ఛీ! ఫో!" అంటుంది గదా! అంతే! దాంతో నీ భగ్నప్రేమకు ప్రథమాంకము మొదలైందన్నమాట! తర్వాత మళ్లీ నా కక్కరలేదు."

"అలాగే గురో!" అంటూ ఇంటికి చేరుకొన్నాడు గిరి చిట్టెమ్మను ఒంటరిగా కలుసుకోవటానికి ఆవేళ, మర్నాడు శతవిధాల ప్రయత్నించాడు లాభంలేకపోయింది "ఎలాగా ?" అని ఆవేళ రాత్రంతా ఆలోచించాడు ఉన్నట్టుండి అతని బుర్రలో మెరుపు మెరసినట్లయింది "ప్రతి శనివారం చిట్టెమ్మ గుడికి ఒంటరిగా వెళ్తుంది. గుడి దగ్గర ఎవ్వరూ ఉండరు అక్కడ మాట్లాడొచ్చు అనుకొని నిదరలో పడిపోయాడు ఒక చిన్న కల తనూ చిట్టీ ఇద్దరూ ఒక రిక్షాలో ఇంగ్లీషు పిక్చరు కెళ్తున్నారట ఇంతలో ఎవరో చిట్టిని రిక్షాలోంచి కిందకు లాగేశారట తను ఖంగారుగా "చిట్టీ" అని అరుస్తూ రిక్షాలోంచి దూకేశాడు అంతే! అక్కడితో గిరికి మెలుకువ వచ్చేసింది కళ్లు తెరిచి చూసేసరికి మంచం కింద తను పడుకొని వున్నాడు జరిగిందంతా కల అని తెలిసేసరికి గిరి చాలా సిగ్గుపడిపోయాడు ఒక చిన్న అనుమానం కూడా వచ్చింది

"కొంపదీసి తను చిట్టెమ్మని నిజంగా ప్రేమించటం లేదుగదా!"

"ఛ! ఛ! నే నెందుకు నిజంగా ప్రేమిస్తాను ? అనుకొని మళ్లీ నిద్దురపోయాడు గిరి

తెల్లారిపోయింది బద్ధకంగా కళ్లు విప్పాడు గిరి కిటికీలోంచి చిట్టెమ్మ ముగ్గు వేస్తూండడం కనిపించింది ముగ్గు పెడ్తుంటే ఆమె జడ ముందుకి పడిపోతోంది "చిట్టెమ్మ చాలా అందంగా ఉంటుంది" అనుకొన్నాడు గిరి మొదటి సారిగా

ఆవేళ శనివారం సాయంత్రం అయి దయే సరికల్లా గుడి దగ్గర బైటాయించాడు గిరి ఎందుకైనా మంచిదని దేముడికి ఒక కొబ్బరికాయ కొట్టాడు పూజారి యిచ్చిన ఫలహారం తింటూ కూర్చున్నాడు అయిదు న్నరఅయిపోయింది అందరూ ఇళ్లకు వెళ్లిపోతున్నారు. "చిట్టెమ్మ ఇంకా రాలేదే? అనుకొన్నాడు గిరి.

ఇంతలో దూరంగా చిట్టెమ్మ వస్తూ కనిపించింది గిరికి బ్రహ్మాండమయిన సంతోషం వేసింది గిరికి "ఇంతాలస్య మయిందేం ?" అని అడిగేద్దామనుకొన్నాడు కాని తమాయించుకొని "ఛ! నేను అలా అడిగేస్తే "ప్లానంతా పాడయిపోతుంది" అనుకొన్నాడు

చిట్టెమ్మ నరాసరి గుళ్లోకి వచ్చి పూలమాల దేముడికి సమర్పించి కొబ్బరికాయ పూజారి కందించి మూడు ప్రదక్షిణాలు పూర్తి చేసేసింది ఆ తరువాత ప్రసాదం అందుకొని బయటకు నడవబోయింది ఎదురుగా గిరి నుంచొని అన్నాడు

"చిట్టెమ్మా! నీతో మాట్లాడాలి! కోనేటి గట్టున కూర్చొందామా ?" అన్నాడు తడబడుతూ

"ఇప్పుడా ?" అంది చిట్టెమ్మ అనుమానంగా

"అవును చిట్టెమ్మా! కాసేపు చాలు!"

మాట్లాడకుండా అతని వెనుక నడిచింది చిట్టెమ్మ

ఇద్దరూ గట్టుమీద కూర్చున్నారు.

"ఏమిటీ ?" అంది చిట్టెమ్మ!

"మరి మరి ఏమీ లేదూ ...." ఖంగారుపడిపోతున్నాడు గిరి

"ఏమీ లేదూ ?" దబాయించింది.

"అదికాదు ... నేను ..."

"ఊ! నువ్వు .."

"చిట్టెమ్మా! నేను నిన్ను ప్రేమిస్తున్నా!"

"ఊ!"










"ఓను" అన్నాను "ఇంకోపేరు చెప్తాను."

"ఏమిటది?"

"గ్రాబెన్—'పోర్ట్ గ్రాబెన్ (Port Grauben) 'మా'నీ'మీద ఈ పేరు చక్కగా ఉంటుంది."

"'పోర్ట్ గ్రాబెన్' అనే అందాము"

నాకు ప్రియమయిన 'వర్లాండ్' అమ్మాయి పేరు మా యాత్రలో ఒక భాగమయిపోయినది

గాలి వాయవ్యంనుంచి వీస్తున్నది దానిముందు అతివేగంగా తేలి వెళ్ళిపోయాము అక్కడ చిక్కని వాతావరణానికి మంచి బలంఉండటంవల్ల 'ఫాన్' (fan) గాలి తోసినట్లు తోసివేసినది

గంట తర్వాత మా వేగం ఎంతో మా పెదనాన్న సరిగ్గా లెక్కవేసి చెప్పగలిగాడు

"ఈవిధంగా గనుకనే వెళ్ళాముంటే ఇరవై నాలుగు గంటల్లో కనీసం ముప్ఫైమైళ్ళయినా ప్రయాణం చేస్తాము త్వరలో అవతలిఒడ్డు చేరుకుంటాము" అన్నాడు

నేను సమాధానం చెప్పకుండా తెప్పముందు వైపు జరిగి కూర్చున్నాను అప్పటికే ఉత్తర దిక్కు తీరంకంటిచూపు మేరదాటి పోతున్నది మా అవగమనం తేలికగా జరిగిపోవాలన్నట్లు తీరం మాకు ఇరువైపులా రెండు బాహువులు సాచినట్లు కనిపించింది వది నా కళ్ళముందు ఒక మహాసముద్రం; దాని నీటిమీద నీడలు పడుతున్న పెద్ద బూడిద రంగు మబ్బులు; విద్యుచ్ఛక్తి వెండి కిరణాలు ప్రతిబింబించే నీటి తుంపర; మా నౌకా మార్గం వెంబడే కనిపిస్తూ ఉండటం ఇదంతా గమనించాను త్వరలో భూభాగం అదృశ్యమయిపోయినది మా తెప్ప వెనుక నురుగు చూస్తే తప్ప మేముకదులుతున్నట్లు అనిపించేది కాదు.

మిట్ట మధ్యాహ్నానికి నీటిమీద పెద్దరకం నాచు చాలా చూశాము ఈ వృక్ష విశేషాలు రెండువేల అడుగుల లోతులో కూడా బాగా దట్టంగా పెరిగి నావల సమూహానికి అడ్డు వస్తూ ఉంటాయని నాకు తెలుసు కాని ఈ లిడెన్‌బ్రాక్ సముద్రంలో నాచు రాక్షస పరిమాణాలు కలిగి ఉన్నది భూమిమీద ఇటువంటి నాచు ఉండదని నా నమ్మకం

మా తెప్పలో కొన్ని అతిదీర్ఘమైనగాఉన్న నాటి ప్రక్కగా ప్రయాణంచేసి వెళ్ళాము ఒక్కొక్కటి మూడువేల అయిదువందల అడుగుల పొడుగు ఉన్నది. కనుచూపు మేరకు అందనిది అంతు తెలియని ఈ 'రిబ్బన్'ల పొడుగు వెంబడే చూస్తూ, అనందించే వాడిని చివరలు ఎప్పుడు కనిపిస్తాయా అని ఎదురు చూసేవాడిని ఇలాగున కొన్ని గంటలదాకా, ఎంత ఓపికతో ఎదురు చూసినా ఫలితం ఉండేదికాదు— ఆశ్చర్యానికి మాత్రం తక్కువలేదు

ఇటువంటి వృక్షవిశేషాలు సృష్టించే ప్రకృతి శక్తి ఎటువంటిది! భూమి మొదటి దశలలో తడి, వేడి అప్పుడే ఏర్పడిన సమయంలో ఇంకా వృక్షాలు తప్ప వేరు ప్రాణులు లేనప్పుడు చూసేందుకు ఎలా ఉండేదో!

సాయంకాలం అయినది అంతకుముందు రోజు నేను గమనించినట్లు గాలి వెలుగు తగ్గలేదు ఈ 'వైచిత్ర్యం' ఎల్లప్పుడూ ఉంటుంది

రాత్రి భోజనం తర్వాత 'తెరచాప స్తంభం' దగ్గరగా పడుకున్నాను ఆ పైన త్వరలోనే కలలు కనటం ప్రారంభించాను.

# భూగర్భంలోనికి సాహసయాత్ర

24—వ పేజీ తరువాయి

చుక్కానిదగ్గ కూర్చున్న హాన్స్‌తో కదలిక లేనే లేదు — తెప్ప దాని దారి అదే చూసుకుంటున్నది గాలివాలుగా ఉన్నప్పుడు చుక్కానితో పనిలేదు

'పోర్ట్ గ్రాబెన్' వదలిన తర్వాత ప్రొఫెసర్ లిడెన్‌బ్రాక్ నన్ను నౌక 'లాగ్' (log) వ్రాయమని చెప్పాడు వీలోజా కాలోజా జరిగినది అంతా ఒక పుస్తకంలో వ్రాయాలన్నమాట. గాలి వీస్తున్న దిక్కు, వేగం, ప్రయాణం చేసిన దూరం మొదలయినవి

మా నౌకా ప్రయాణం వివరాలు బాగా తెలిసేందుకు నేను ప్రతిదినం వ్రాసిన 'నోట్స్' (Notes) ఇక్కడ ఇస్తున్నాను.

శుక్రవారం, ఆగష్టు 14—వాయవ్యంనుంచి వేగమయిన గాలి, తెప్ప వేరుగా మరుగ్గా పోతోంది తీరం గాలిదిక్కునే ముప్ఫైమైళ్ళదూరంలో ఉన్నది దిగంతంమీద ఏమీ కనిపించటంలేదు కాంతి తీవ్రతలో మార్పు లేదు వాతావరణం బాగా ఉన్నది— అంటే మేఘాలు మంచి ఎత్తున ఉన్నాయి. కరగబోసిన వెండిలో కడిగినట్లు, తెల్లగా మెరుస్తున్నాయి

థర్మామీటర్—32 డిగ్రీలు సెంటిగ్రేడ్

మిట్ట మధ్యాహ్నానికి హాన్స్ గాలం వేశాడు రెండు గంటలవరకూ ఏమీ పడలేదు. ఈ నీటిలో ప్రాణులే లేవా? కాదు. హాన్స్ ఒక చేప పట్టుకున్నాడు. అది గాలం చివర కొట్టుకుంటోంది

"చేప!" అని అరిచాడు మా పెదనాన్న.

"'స్టర్జన్' (Sturgeon) చేప!" అని నేను అరిచాను "చిన్న స్టర్జన్!"

ప్రొఫెసర్‌గారు దానిని జాగ్రత్తగా పరిశీలించి నా అభిప్రాయంతో ఏకీభవించలేదు ఈ చేపతల గుండ్రంగా, చదునుగా ఉన్నది దేహం క్రిందిభాగం మీద ఎముకల పొలుసులు కనిపిస్తున్నాయి పళ్ళులేవు. ఈ జాతి ప్రాణులు 'స్టర్జన్' చేప వర్గానికి చెందినవే అయినా కొన్ని ముఖ్యమయిన విషయాలలో వేరుగా కనిపిస్తున్నాయి.

మా పెదనాన్న అట్టేసేపు సందేహించలేదు. కొన్నిక్షణాలుపరీక్ష చేసి, 'డెవానియన్'(Devonian) యుగం భూభాగంలో దొరికే 'ఫాసిల్' చేప ఇది ఇప్పుడు భూతలంమీద దొరకదు" అన్నాడు

"ఏమిటీ!" అన్నాను. "ప్రాచీన సముద్రాలలో నివసించిన ప్రాణి నొకదానిని సజీవంగా పట్టుకున్నామా?"

"అవును" అని సమాధానం ఇచ్చాడు ప్రొఫెసర్‌గారు పరీక్ష కొనసాగిస్తూనే "ఈ 'ఫాసిల్' చేపలు నేటి సజాతులు వంటివి కావని నువ్వే గ్రహిస్తున్నావు ఇటువంటిదానిని సజీవంగా పట్టుకొనడం ఏ శాస్త్రజ్ఞుడికైనా అదృష్టమే!"

"కాని దాని వర్గీకరణం ఎలా చేస్తావు?"

"'గానోయిడెయి' (Ganoidei) వర్గ

# భూగర్భంలోనికి సాహసయాత్ర

సెఫిలాస్పిడే (Cephalaspidae) కుటుంబం, ఇంకా "

"ఇంకా?"

"టెరిక్ థిస్ (Pterychthys) జాతికి చెందినదని ఒట్టువేసి చెప్పగలను కాని దీనిలో కని పించే ఒక విచిత్ర గుణం భూమికింద చేపలకు మాత్రమే ఉంటుందంటారు"

"ఏమిటా గుణం?"

"కళ్ళు లేకపోవడమే.

"కళ్ళుండవా!"

"చూపుకు సంబంధించిన ఇంద్రియాలు ఏవీ ఉండవు"

నేనూ పరీక్షచేసి చూశాను అంతా నిజమే! కాని ఇది ఒక ప్రత్యేకమయిన చేపఅయి ఉండవచ్చు మళ్ళీ గాలం వేశాము ఈ సముద్రభాగంలో కావలసి నన్ని చేపలు ఉన్నట్లు ఉన్నాయి రెండు గంటలలో చాలా 'టెరిక్ థిస్'లు పట్టుబడ్డాయి ఇంతేకాక 'డిప్టెరిడ్' (Dipteridae) 'కుటుంబా' నికి చెందినవి కూడా కొన్ని పట్టుకున్నాము దీని జాతి ఏమిటో మా పెదనాన్న చెప్పలేకపోయాడు. వీటిలో ఒక్కదానికయినా చూపుకు సంబంధించిన ఇంద్రియమేలేదు ఈ చేపలు అనుకోకుండా దొర కటం మా భోజనానికి మంచిదే అయినది

సరే, ఈ చేపలు 'ఫాసిల్' రకం చేపలవలెనే కనిపిస్తున్నాయని నిర్ధారణ అయినది

భూమిమీద ఎముక ముక్కలు తప్ప దొరకని చేపలు ఇక్కడ సజీవంగా చూడవచ్చునేమో!

దూరదర్శినితో సముద్రం కలయచూశాను. ఎక్కడా జీవరాశి మాటన కనిపించలేదు తీరానికి మరీ దగ్గరగా ఉండిఉంటాము

పైన 'గాలి'లోనికిచూశాను కువియర్(Cuvier) శాస్త్రజ్ఞుడు ఊహించిన వింత పక్షులు ఇక్కడ తిరుగుతూఉంటే చూడవచ్చునా? వాటికి ఈ చేపలే ఆహారం. ఆకాశం అంతా వెతికాముకాని మా వెనుకనేం ఎంత నిర్జీవమో ఇదీ అంతే

అయినా నా ఊహలు అతి ప్రాచీనకాలంలో జీవించిన జంతువులకు సంబంధించిన శాస్త్రంయొక్క అద్భుత సిద్ధాంతాలమీదకు పోతున్నాయి కలలుకంటున్నాను రాక్షస కూర్మాలు — చిన్న ద్వీపాలవంటివి — కళ్ళకు కట్టినట్లు కనిపించాయి ప్రజిల్‌గుహాలలో దొరికే 'లెప్టొథిరియమ్' (Leptotherium) సైబీరియా మంచు ప్రదేశాలలో కనిపించే 'మెరికోథిరియమ్' (Mericothe rium) ఇవి రెండూ అప్పైన 'పాచిడర్‌మ్‌లో-ఫియోడన్' (Pachy-dermlophiodon) ఈ మృగం రాళ్ళ వెనుక పొంచి తను వేట ఆడి దంపిన ఆహారం 'ఎనాప్లొథిరియమ్' (Anoplotherium) దొంగిలించకుండా కాపాడుతూ ఉంటుంది 'ఎనాప్లొథిరియం' ఒక వింత జంతువు ఖడ్గమృగం, గుర్రం నీటిగుర్రం,ఒంటె పోలికలు అన్నీ ఉంటాయి సృష్టికర్త ఈ విశ్వం నిర్మించిన మొదటి ఘడియ హడావుడిలో వేర్వేరు మృగాలు కలిపి ఒకటే చేసినట్లు ఉంటుంది "మాస్టడాన్' (Mastadon) తన తొండం ఆడిస్తూ, దంతాలతో రాళ్ళను పగులకొట్ట గలదు '(ప్రోటో పితికస్' (Protopithecus) భూమిమీద మొదటి కోతి. ఇది ఎత్తు కొండలపైకి ఎక్కుతూ ఉండేది గాలిలో ఒక పెద్ద గబ్బిలంవలె ఎగిరే 'మృగం' 'టెరో డాక్టయిల్' (Ptero-dactyl) ఈ రకం జంతువుపైన పెద్ద పెద్ద పక్షులు కూడా ఎగురుతూ ఉంటాయి

ఈవిధంగా 'ఫాసిల్' ప్రపంచం అంతా నా భావనలో తిరిగి సృష్టింపబడినది ఇంకా మానవుడు జన్మించడానికి యుగాల వెనుకటి కాలానికి ప్రయాణం చేశాను నా స్వప్నంనన్ను ఇంకా వెనుకకి తీసుకుపోయినది కదిలే ప్రాణులు ఈ ప్రపంచంలో కనిపించే ముందు కాలానికి వెళ్ళిపోయాను చేపలు, అల్చిప్ప లలో నివసించే ప్రాణులు కూడా నా వూహలో మాయమయిపోయి ఈ నిర్జీవ ప్రపంచంలో స్పందించే గుండె నాది ఒక్కటే అనిపించినది ఋతువులు లేవు వాతావరణంలో మార్పులు లేవు భూగోళంలోపలి వేడి క్రమంగా అధికమయి ఆకాశంలో సూర్యుడి వేడి తెలియుటంలేదు వృక్షాలు పెద్ద వయిపోతున్నాయి ఈ రాక్షస వృక్షాలక్రింద నేనొక నీడనయిపోయి నడిచాను మెరుస్తున్న మట్టి మీద నా కాళ్ళు తడబడుతున్నాయి అత్యున్నతములయిన చెట్ల మొదళ్లమీద అనుకుంటున్నాను

యుగాలు దినాలవలె గడచిపోతున్నాయి భూగోళం పరిణామాలు సింహావలోకనం చేస్తున్నాను చెట్లు అదృశ్యం అవుతున్నాయి పెద్ద పెద్ద గ్రానైట్ రాళ్ళు తమ కాఠిన్యం కోల్పోతున్నాయి నీరు భూతలాన్ని కప్పివేస్తున్నది ఉడికి పోతున్నది ఆవిరిగా మారిపోతున్నది ఈ ఆవిరి భూగోళం ఆవరిస్తున్నది క్రమంగా భూమి కూడా తెల్లగా మండుతున్న వాయు పదార్థం అయిపోతున్నది—సూర్యునితో సమానంగా, అంత కాంతివంతంగా మారిపోతున్నది

గ్రహాలమధ్య అంతరిక్షంలో 'విహారం' చేస్తున్నాను ఈ వాయు పదార్థాల గోళం ఒకనాడు ఘనీభవించి ఏర్పడనున్న భూగోళంకంటే పధ్నాలుగు లక్షలరెట్లు పెద్దది నా దేహం కూడా ఆవిరిగా మారి అనంతాకాశంలో ఉజ్జ్వలంగా పరిభ్రమిస్తున్న ఈ ఆవిరిలో మరొక పరమాణువువలె కలిసిపోయాను.

"దివాళా తీయటమంటే ఏమిటి నాన్నా" వర్తకుని ముద్దుల కొడుకు తండ్రిని అడిగాడు.

"ఏముందీ! ఉన్న డబ్బు బొడ్డున దోపుకుని, అప్పుల వాళ్లకు కోటు విప్పి చూపించటం!" వర్తకుడు అసలు కిటుకు చెప్పేశాడు.

కె. జి. శర్మ (మద్రాసు)

ఏమి కల! ఎక్కడికి తీసుకుపోతున్నది? జ్వరం వచ్చినవాడివలె ఈ విచిత్రమయిన వివరాలు వ్రాసుకుంటున్నాను అన్నీ మరిచిపోయాను—ప్రొఫెసర్ గారు, మా గైడ్, తెప్ప అన్నీ!

"ఏమిటి ఆక్సెల్ అలా ఉన్నావ్?" అంటున్నాడు మా పెదనాన్న

నా కళ్ళు అతనివైపే తిరిగిఉన్నా అతను నాకు కనిపించటం లేదు

"ఆక్సెల్ జాగ్రత్త!" అని అరుస్తున్నాడు మా పెదనాన్న " సముద్రంలో పడ్తావ్!"

మా గైడ్ నా చెయ్యి గట్టిగా పట్టుకున్నాడని గ్రహించాను అతను నన్ను పట్టుకొనకపోయినట్లయితే వెళ్ళి అలల మధ్య పడిపోయేవాడిని

"పిచ్చేమయినా ఎక్కిందా?" అని అరుస్తున్నాడు ప్రొఫెసర్‌గారు

నాకు కొంచెం కొంచెంగా ఒళ్ళు తెలుస్తున్నది. "ఏమయింది?" అని అడుగుతాను చివరకు

"ఒంట్లో బాగా లేదా?"

"కాదు ఒక క్షణం నా మతి చలించిందికాని ఇప్పుడు అంతా సరిపోయింది ఇంకేమీ ప్రమాదం లేదు కదా?"

"లేదు! మంచిగాలి, కల్లోలంలేని సముద్రం! మంచి వేగంగా పోతున్నాము! నా అంచనా సరి అయినట్లయితే త్వరలో భూమి చేరుకోవాలి!"

ఈ మాటలు విన్న నేను నుంచుని దిగంతరేఖ పరీక్షగా చూస్తాను కాని మాముందు నీరు మేఘాలలో కలిసిపోవటమే కనిపిస్తున్నది.

## 33

శనివారం, ఆగస్టు 15—ఎటుచూసినా సముద్రమే ఇంతవరకూ నేల కనిపించలేదు దిగంతం దూరంగా ఉన్నట్లు అనిపిస్తున్నది

నాకువచ్చిన కల ప్రభావంవల్ల తల దిమ్ముగా ఉన్నది

మా పెదనాన్న కలలు కనటంలేదు ఆయనకు ఆ అలవాటులేదు కాని చిరాకుగా ఉన్నాడు దూరదర్శినితో అన్ని దిక్కులూ కలయజూసి, వినుగుగా చేతులు కట్టుకుని పూరుకుంటాడు

ప్రొఫెసర్ లిడెన్‌బ్రోక్‌లో తిరిగి పాత వాలకాలు కొన్ని కనిపించటం గమనిస్తున్నాను విసుగు, అసహనం ఎప్పటివలె అధికం అవుతూ ఉన్నాయని 'నోట్' చేసేశాను కూడా నేను పడిన కష్టాలు, ప్రమాదాలు ఆయనలోని 'కరుణ'ను బయటకు లాగాయి నేను కోలుకున్న తర్వాతనుంచీ నిజ స్వభావానిదే పైచేయి కాని ఆయన హడావుడి దేనికి? మా నౌకా ప్రయాణం 'సాఫీగా' జరుగుతున్నది కదా? తెప్ప అద్భుతమయిన వేగంతో ముందుకుసాగిపోతున్నదికదా?

"నీకేం తోచడం లేదనుకుంటా పెదనాన్నా" అన్నాను ఆయన మళ్ళీ మళ్ళీ దూరదర్శిని కంటికి అన్చి చూస్తూ ఉంటే

"తోచక పోవటమా? లేదే"

"పోనీ సహనం నశిస్తోంది అందామా?"

"అసలు ఇంతవరకూ ఓర్చుకుని వచ్చినదే చాలు"

"ఏమిటి? చురుగ్గానే సాగిపోతున్నాంకదా—"

"చురుగ్గా వెళ్లినంతమాత్రాన నాకేమి లాభం? అయినా మన గమనం మందంగా ఉన్నదని కాదు ఈ సముద్రం మరీ పెద్దదిగా ఉన్నది!"

బయలుదేరేముందు ప్రొఫెసర్‌గారు మేము ప్రయాణంచేసే 'గుహ' తొంభైమైళ్ల పొడుగు ఉంటుందని అంచనా వేసిన సంగతి జ్ఞాపకం వస్తున్నది దానికి మూడు రెట్లు దూరం ఇప్పటికే దాటినా దక్షిణంవైపు తీరం కనిపించటంలేదు

"కిందకి వెళ్లటంలేదు!" అన్నాడు ప్రొఫెసర్ గారు "ఎంతకాలం వృధా అవుతోంది! ఒక్కముక్కలో చెప్పాలంటే, ఇంతదూరం వచ్చింది ఒక కోనేరులో సరదాగా తిరగాలని కాదుగా!

ఈ ప్రయాణం సరదాగా తిరగడం అంటాడు ఈ సముద్రం కోనేరు అంటాడు!

"అయినా" అని నేను, "సాక్నుస్సెమ్ చెప్పినట్టే వెడుతున్నాము కాబట్టి "

"అదే ఇప్పుడు ఆలోచించవలసిన విషయం. అతని దారివెంబడే వెడుతున్నామా అని అతను ఈ సముద్రం దాటాడా? లేకపోయినట్లయితే మనం అనుసరించిన వాగు మనల్ని తప్పుదారిన తీసుకు పోతోందా?"

"ఏది ఎలాఉన్నా ఇంతదూరం వచ్చినందుకు విచారించవలసిన పనిలేదు దృశ్యం అద్భుతంగా ఉన్నది అంతేకాక—"

"నాకు దృశ్యాలు అనవసరం ఓ నొక లక్ష్యం సాధించాలని బయలుదేరాను దానిని సాధించి తీరవలసిందే! దృశ్యాలు చూడమని చెప్పక!"

దానితో ఈ వ్యవహారం ముగిసినట్లే ప్రొఫెసర్ గారు అసహనంతో పెదిమలు కొరుక్కుంటూ కూర్చుంటున్నాడు ఆరు గంటలకు హాన్స్ జీతం అడిగి తనకు కావలసిన మూడు 'రిగెన్ డాలర్' పుచ్చుకుంటాడు

ఆదివారం, ఆగస్టు 16— విశేషం ఏమీ లేదు వాతావరణంలో మార్పులేదు గాలి వేగం కొద్దిగా అధికం అయ్యేట్టు ఉన్నది నిద్ర మేలుకోగానే వెలుగు తీవ్రత ఎలా ఉన్నదీ చూడటం నా మొదటి పని విద్యుచ్ఛక్తి తగ్గి మసకబడి, ఆ తర్వాత పూర్తిగా చీకటి అయిపోతుందేమో అని నా భయం కాని ఇది జరిగేట్టులేదు మా తెప్పనీడ నీటిమీద స్పష్టంగా తెలుస్తున్నది

ఇది నిజంగా అనంతం అనదగిన సముద్రం! అట్లాంటిక్, మెడిటరేనియన్ సముద్రాలంత పెద్దది ఎందుకు కాకూడదు?

మా పెదనాన్న ఊరికే లోతు చూస్తున్నాడు బరువైన ఒక పార త్రాటికి తగిలించి లోపలకు దింపుతున్నాడు ఆరువందల అడుగులు దింపినా, క్రింద నేల తగలటంలేదు ఈ పార మళ్లీ పైకి లాగటానికి చాలాసేపు పడుతున్నది కష్టంగా కూడా ఉన్నది

పార తెప్పమీద పడవేసిన తర్వాత హాన్స్ దానిమీద పడిన గాట్లు నాకు చూపిస్తాడు ఇనుము రెండు గట్టి పదార్థాల మధ్య నలిగినట్టు కనిపిస్తున్నది

"టెండర్!" అంటాడు మా గైడ్

నాకు అర్థంకాదు మా పెదనాన్నవైపు తిరుగుతాను ఆయన ఏదో గాఢంగా ఆలోచిస్తున్నాడు ఆయన ఏకాగ్రత భంగపరచడం ఇష్టంలేదు మా ఐస్‌లాండర్‌వైపు తిరుగుతాను దవడలు మూసి తెరిచి నాకు అర్థం అయేట్టు సంజ్ఞలు చేస్తాడు

"దంతాలు!" అంటాను దిగ్భ్రాంతితో ఇనుము కడ్డీని ఇంకా జాగ్రత్తగా పరిశీలిస్తాను.

అవును! ఆ గాట్లు పళ్ల గుర్తులే! ఎంత బలమయిన దవడలకి చెంది ఉండాలి! సొరచేపకన్నా . తిమింగలంకన్నా భయంకరమైనదీ అయిన జంతువును ఏదైనా కదిలించామా? ఆహారంనుంచి నా చూపు మరల్చలేక పోతున్నాను నిన్నటి కలలు నిజమవుతాయా?

ఈ ఆలోచనలు నన్ను కలవరపెడుతున్నాయి రోజంతా మనస్సు సరిగ్గా ఉండదు నిద్రపోయి లేచిన తర్వాత కూడా శాంతించలేదు

సోమవారం ఆగస్టు 17—చేపలు మొదలయిన జల జంతువుల తర్వాత వచ్చిన జీవరాశికి సంబంధించిన యుగం గురించి ఆలోచిస్తున్నాను ఈ యుగం 'ఉరగ' యుగం సముద్రాలలోఉండి నీటి పైన పూర్తి ఆధిపత్యం కలిగి ఉండేవి వాటి పరిమాణాలు ఎంతెంత, వాటి బలం ఎటువంటిది! మనం ఈరోజు చూసే మొసళ్లు నీటిముందు ఏమూల?

వీటిని స్మరించిన నాకు వణుకు పుడుతున్నది వాటిని మానవుడు ఎవరూ కంటితో చూడలేదు మనుష్యులకు వెయ్యి తరాల మునుపు భూమిమీద కనిపించాయి వాటి 'ఫాసిల్' లు మాత్రం మిగిలి అవి ఎంత పెద్దవో తెలుసుకొనటానికి ఉపయోగపడ్డాయి

హాంబర్గ్ మ్యూజియంలో ముప్పై అడుగుల పొడుగున్న ఒక జంతువు అస్థిపంజరం చూశాను ఆధునిక ప్రపంచవాసిఅయిన నాకు ఈ 'ప్రాచీన మృగాల' ప్రతినిధి ఒక దానిని చూసే యోగం ఉన్నదా? లేదు! వీల్లేదు! అయినా గట్టి పళ్లగాట్లు ఇనుప కడ్డీమీద చెక్కిఉన్నాయి వాటినిచూస్తే మొసలిపళ్లవంటి పళ్లుకలజంతువు ఏదో కరిచింది అనిపిస్తున్నది

భయంతో సముద్రంవైపు చూస్తాను పాతాళ గుహలలోనివసిస్తున్న ప్రాణి ఏదయినా నీటిలోనుంచి పైకి వస్తుందేమోనని నా భయం

ప్రొఫెసర్ లిడెన్‌బ్రోక్‌కు కూడా నాకు తోచినవే తోస్తున్నాయనుకుంటాను, నాకు కలిగిన భయాలు కలుగకపోయినా; ఎందుకంటే పార పరీక్షించిన తర్వాత సముద్రం జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు

"అబ్బా!" అనుకున్నాను "లోతు కనుక్కుందా మనుకుంటాడు! ఏదో జల మృగం కదిపి ఉంటాడు. ఇది మనమీద పడదు కదా . !"

మా ఆయుధాలవైపు చూసి, అవి సరిగ్గా పని చేస్తాయని నిర్ధారణ చేసుకుంటాను మా పెదనాన్న నా ఉద్దేశ్యం కనిపెట్టి తన అనుమతి తెలిపేందుకు తల పూపుతున్నాడు

నీటిమీద అలజడినిబట్టి లోపల ఎక్కడో కదలిక ఉన్నదని తెలుస్తున్నది ప్రమాదం దగ్గరలోనే ఉన్నది అప్రమత్తతతో దానికోసం ఎదురు చూడాలి.

మంగళవారం, ఆగస్టు 18—సాయంత్రం దగ్గరకు వచ్చేస్తున్నది—అంటే మాకు నిద్ర వచ్చిన దన్నమాట ఈ మహా సముద్రంమీద రాత్రి లేనే లేదు ఎప్పుడూ వెలుగుఉంటూనే ఉంటుంది ఈ వెల్తురికి మాకళ్లు కొంచెం అలిసిపోతాయి హాన్స్ చుక్కానివద్ద ఉన్నాడు అతను మేలుకున్నంతసేపూ నేను నిద్ర పోవచ్చు

రెండు గంటల అనంతరం మా తెప్ప అదిరి పోవటంతో నాకు మెలుకువ వస్తుంది తెప్ప నీటిమీద నుంచి పైకిలేచి సుమారు నూటఇరవై అడుగుల అవతల వెళ్లి వాలింది

"ఏం జరిగింది?" అని అరుస్తాడు, మా పెదనాన్న "నేల తగిలిందా?"

హాన్స్ చెయ్యెత్తి చూపుతాడు పన్నెండువందల అడుగుల అవతల ఒక నల్లటి వస్తువు ఏదో నీటిలో ఎగురుతూ, తేలుతూ, మునుగుతూ కనిపిస్తున్నది. నేను దానిని పరిశీలించి అరుస్తాను

"అదొక పెద్ద 'పోర్పాయిస్'" (Porpoise) నీటిలో నివసించే (ఈ సస్తనజాతి మృగానికి నిఘంటువులో 'వారిశూకరం' అనే పేరు ఉన్నా ఇక్కడ ఇంగ్లీషు మాట మాత్రమే వాడబడుతున్నది )

"అవును" అని మా పెదనాన్న సమాధానం, "అవతలచూడు ఎంత పెద్ద 'నీటి బల్లి' కనిపిస్తోందో!"

"దాని కవతల ఒక రాక్షసి మొసలి! దాని దవడలు, ఆ పళ్ల వరసలు చూడు! అరే మాయమయి పోయిందే!"

"తిమింగలం! తిమింగలం!" అని మా పెదనాన్న అరుస్తాడు "దాని 'ఫిన్' (Fin: చేపరెక్క )లు కనిపిస్తున్నాయి! ఎంతనీరు, గాలిపైకి వదులుతోందో చూడు!" సముద్రంమీద రెండు నీటి ధారలు మంచి ఎత్తున లేస్తున్నాయి ఈ రాక్షస జలమృగాల మంద సమక్షంలో మా ఆశ్చర్యం, భయం, విభ్రాంతి ఇంతా అంతా కాదు. వాటి పరి

---

రైలు ప్రమాదంలో బొటన వేలు పోగొట్టుకున్న వర్ధనమ్మగారు తనకు 10 వేలు నష్టపరిహారం చెల్లించాలని అధికారులను కోరింది.

"మీరు అడిగిన డబ్బు చాలా ఎక్కువ" అన్నాడు రైల్వే అధికారి అనునయంగా.

"అబ్బే! అలా అనకండి. ఆ వేలుతోనే మా ఆయన్ను అదుపులో ఉంచేదాన్ని!" వర్ధనమ్మగారు యదార్థం చెప్పేరు.

ఉషా, (మద్రాసు)

---



చిత్తరువు లోని భావము ఆనంద పారవశ్యము



# సావరిన్



మిఠాయిలు, టాఫీలు

ప్రజల ఎన్నిక పొందినవి

కోహినూర్ కన్ఫెక్షనరీ ప్రైవేట్ లిమిటెడ్, మదరాసు-26

EP SOV TEL 1

# నోపిన్



కాల్ కెమికో వారి బాధా నివారిణి

కండరముల నొప్పి, నీరూరికా, గుండె జలుబు నుండి సత్వరము కొరకు

# మార్గ్యూయెన్టమ్

నీమ్ క్రీమ్

దురదలు, పొంటిమలు, స్ఫోటకపు మచ్చలు, కురుపులు, గాయములు, పుండ్లు, మొ వాటికి



కాల్ కెమికో వారి వస్తువులు — "మార్గో" సబ్బును తయారు చేయువారు.

CF-2TL-61

దక్షిణ ఇండియా ఆఫీసు 5/149 బ్రాడ్వే మద్రాసు-1.

భూగాలు నమ్మ శక్యంకానివి వాటిలో చిన్న జంతువు కూడా ఒకసారి పళ్లతో నొక్కిందంటే మా తెప్ప తునా తునకలు అవుతుంది హాన్స్ ఇంకొక దిక్కు వెడితే మంచిదేమో అని చుక్కాని త్రిప్పబోతాడు కాని అవైపు కూడా భయంకరమయిన 'శత్రువులు' చూస్తాడు నలభై అడుగుల తాబేలు, ముప్పెయి అడుగుల సర్పము

ఎక్కడికి పారిపోగలము? ఈ 'ఉరగములు' ఒక్కొక్కటీ దగ్గరకు వస్తున్నాయి ఒక ఎక్స్‌ప్రెస్ రైలుబండి వేగంకన్నా ఎక్కువ వేగంతో మా చుట్టూ తిరుగుతున్నాయి దగ్గర దగ్గరగా వస్తున్నాయి తుపాకి చేతబట్టానుకాని దాని 'బుల్లెట్' వాటిని ఏమి చేయగలదు?

భయంతో మూగవోయాము మామీదకు వచ్చి పడుతున్నాయి! ఒకవైపు మొసలి, మరొకవైపు పాము మిగిలిన జంతువులన్నీ మాయం అయిపోయాయి తుపాకి పేల్చబోతున్నాను హాన్స్ నన్ను ఆపమన్నట్లు సంజ్ఞ చేస్తాడు ఆ రెండు రాక్షస మృగాలూ మా తెప్పకు సుమారు ఆరు వందల అడుగుల అవతల కలుసుకుని పోట్లాడుకొనటం ప్రారంభిస్తాయి మమ్మల్ని చూడనే చూడవు

ఆ రెండూ పోట్లాడుకొనటం చూస్తూ ఉండిపోతాము నాకేమో పార్పాయిస్, బల్లి, తావెలు— ఇవన్నీ వచ్చి యుద్ధంలో పాల్గొంటున్నాయి అనిపిస్తుంది ఒక్కొక్కటీ కనిపించినప్పుడు మా 'అయిస్ లాండర్'కు చూపిస్తాను

"ట్వవ్" అంటాడు అతను

"ఏమిటీ రెండా! రెండే జంతువులు—"

"అతను చెప్పింది సరిగ్గానే ఉంది!" అని మా పెదనాన్న అరుస్తాడు దూరదర్శిని ఇందాకటినుంచి కంటివద్దనే ఉన్నది

# భూగర్భంలోనికి సాహసయాత్ర

"అదెలా సాధ్యం!"

"సాధ్యమే! మొదటి జంతువుకి పార్పాయిస్ మూతి, బల్లి తలకాయ, మొసలి పళ్లూ ఉన్నాయి అందువల్లనే మనం ఇవన్నీ ఉన్నాయనుకున్నాం! ఇది భయంకరమైన మృగాలలో ఒకటి—'ఇక్తియోసారస్' (Ichthyosaurus) అంటారు "

"రెండోది?"

"రెండోది తాబేటి చిప్పవంటి కవచం కల సర్పం మొదటిదానికి గర్భశత్రువు! దానిపేరు 'ప్లెసియో సారస్' (Plesiosaurus)

హాన్స్ చెప్పినది నిజమే నీటిలో పోరాడేవి రెండే జంతువులు ఈ భయంకర 'ఉరగ' మృగాలముందు నేను! 'ఇక్తియోసారస్' కన్ను ఎర్రగా కనిపిస్తున్నది మనిషి తలకాయ అంత ఉంటుంది! ఇది చాలా లోతు నీళ్లలో నివసిస్తుంది అక్కడ పీడనాశక్తి అత్యధికంగా ఉండటంచేత ఈ కన్ను చాలా గట్టిదై ఉండాలి దాని పొడుగు కనీసం వంద అడుగులయినా ఉంటుంది దవడ, రాక్షస పరిమాణాలు కలది: దీనికి మాట ఎనభై ఎనిమిది పళ్లకు తక్కువ ఉండవని ఒక శాస్త్రజ్ఞుడు చెప్పాడు

'ప్లెసియో సారస్' కాళ్లు పడవ తెడ్లను పోలి ఉంటాయి 'శల్కాలా' ల (Scales) తో కప్పబడిఉన్న దాని శరీరం చెట్టు మొదలువలె స్తంభాకారం కలిగి ఉంటుంది పొట్టితోక, ముప్పై అడుగుల మెడ! హంస మెడవలె ఎటు కావలసినా వంగుతుంది

వర్ణనాతీతమయిన క్రోధంతో ఈ జంతువులు రెండూ యుద్ధం చేస్తున్నాయి ఈ యుద్ధం యొక్క తీవ్రతకు పెద్ద అలలు వచ్చి మా తెప్పమీద పడుతున్నాయి ఇరవైసార్లు మేము మునిగిపోయినంత పని అవుతుంది. భరించలేనంత స్వరంతో బుసలు మా చెవులు తాకుతున్నాయి రెండు జంతువులూ పెనవేసుకుని పోతున్నాయి! గెలిచిన దాని క్రోధం తలుచుకుంటే భయంగా ఉన్నది

ఒక గంట రెండు గంటలు గడిచాయి పోరాటం ఇంకా జరుగుతూనే ఉన్నది ఒకసారి మా వైపు జరుగుతాయి మరొకసారి దూరంగా వెళ్లిపోతాయి. తుపాకులు సిద్ధంగాఉంచి కాచుకుని ఉండటంకంటే మేము చేసేది వేరేమీలేదు

ఇంతలో రెండు జంతువులూ, హటాత్తుగా నీటిలోకి మాయమవుతాయి కొన్ని నిముషాలు గడుస్తాయి యుద్ధం సముద్రం లోతులలో ముగిసిపోతుందా?

ఒక పెద్ద తల నీటి బయటకు కనిపిస్తుంది— ప్లెసియోసారస్ తల మరణావస్థలో ఉన్నది దాని శరీరంమీద చిప్ప కనిపించటంలేదు పొడుగాటి మెడ మాత్రం తిరిగి తిరిగి 'సుంచుని పడిపోతున్నది దాని తాకిడికి పెద్ద అలలు వస్తున్నాయి రెండు ముక్కలుగా తెగిన పురుగు గిలగిల కొట్టుకుంటున్నట్లు ఉన్నది కళ్లు కనిపించకుండా చేసేటంత నీటి తుంపర ఏర్పడుతున్నది కాని చివరకు ఆ ఉరగంయొక్క బీభత్సం తగ్గిపోతుంది కొంత సేపటికి దాని మృత కళేబరం నీటిమీద తేలుతుంది

మరి ఇక్తియోసారస్ ఏమయినట్లు? అగాధాలలో దాని గుహలోనికి వెళ్లిపోయినదా?—లేక మళీ నీటిమీదకు తిరిగి వస్తుందా? (సశేషం)

# ఏడుకొండలు

23వ పేజీ తరువాయి

శ్యామ్‌బాబు ఎవరివద్దా అరువుపెట్టదల్చుకోలేదు, ఒక్క వీర్రాజువద్ద తప్ప

తనదగ్గర బొత్తిగా డబ్బులేకపోవటం, హోటళ్లోగాని, కొట్లమీదగాని అరువు పెట్టకపోవడం వల్ల శ్యామ్‌బాబు రెండురోజులు భోజనంగాని, టిఫిన్‌గాని లేకుండా గడిపాడు కేవలం రెండు పూటలా ధర్మసూరిగారి కుటుంబం ఇచ్చే పాలవల్ల తన ఆకలిబాధ తీర్చుకొనేవాడు మూడోరోజు కూడా వచ్చింది ఇక వుండటం కష్టమనిపించింది శ్యామ్‌బాబుకు సత్యనారాయణగార్నే మళ్లీ కొంత డబ్బు అడుగుదామంటే, ఆయన హైద్రాబాదు, వెళ్లి నాలుగురోజులైంది మరోవారం రోజుల దాకా రారు ఈసారి ఆయనతో ధర్మసూరిగారిని కూడా తీసుకువెళ్లారు ధర్మసూరిగారి కుటుంబానికి కూడా చాలా చికాకుగా వుంది

మునుపు, అప్పుడప్పుడు శ్యామ్‌బాబు పస్తులుండవలసివస్తే డాక్టర్ మిశ్రా, దినకర్, సత్యనారాయణగారూ మొదలైనవాళ్ల సాయం తను అడగగానే లభిస్తుందికదా అన్న ధైర్యం వుండేది ఇప్పుడు వాళ్లెవరూ వూళ్లో లేకపోవడంవల్ల శ్యామ్‌బాబుకు మనస్సులో కొంచెం భయంవేసింది ఎన్నాళ్లు తను ఈ పరీక్షకు తట్టుకోగలనా? అన్న సందేహం కలిగింది అతనికి భోజనం లేకపోవడంవల్ల సిగరెట్లు ఎక్కువ కాల్చేసేవాడు వీర్రాజు ధర్మమా అని సిగరెట్లకుమట్టుకు కరువులేదు మూడో రోజు పగలల్లా సత్యన్నారాయణగారి మిల్లులో గడిపాడు మధ్యాహ్నంపూట, మిల్లు కూలీలు ఇంటివద్దనుంచి తెచ్చుకున్న అంబలికూడు తింటూవుంటే అతని దృష్టంతా అటువైపే వుంది సిగరెట్లుఅన్నీ అయిపోవడంవల్ల సిగరెట్లు తెచ్చుకుందామని వీర్రాజు కొట్టుకి బయల్దేరాడు శ్యామ్‌బాబు

దారిలో, చెట్టుకింద, ముసలిదొకర్తె జంగిడిలో పుణుకులూ, జంతికలూ, చేగోడీలు పెట్టుకొని అమ్ముతున్నది తను ఇంతవరకు ఆ ముసలిదాన్ని గానీ, ఆ జంగిడినిగాని విమర్శగా చూడలేదు ఇప్పుడు తనలోని ఆకలి ఆ జంగిడివైపు తను అప్యాయంగా చూసేట్టు చేస్తోంది ఆ ముసలమ్మ నడిగి నాలుగు పుణుకులు తీసుకొందామనిపించేట్టు చేస్తోంది డబ్బులు బొత్తిగా లేకపోవడంవల్ల శ్యామ్‌బాబు వూరుకున్నాడుగాని, ఆ ముసలిది అమ్మే జంతికలు తినాలని ఎంతో అనిపించిం దతనికి

ఒక యింట్లోంచి ఒక స్త్రీ వీధులోకివచ్చి, భోజనాలు చేసిన అరటిఆకుల్ని రోడ్డుప్రక్క పారేసి వెళ్లిపోయింది రెండు కుక్కలు ఆ ఆకుల్ని కెలికి, ఆ ఆకులికి అంటుకునివున్న పెరుగుని నాకసాగాయి శ్యామ్‌బాబు మానసికంగా, ఆ కుక్కల ఆతురత ఎటువంటిదో అర్థం చేసుకున్నాడు ఆకలి మనిషిని ఎంత నీచ స్థితికైనా తయారు చేస్తుందని అనుకొన్నాడు ఆ క్షణంలో అరటాకుల్ని తృప్తిగా నాకుతున్న కుక్కకూ, ఆకలికోసం అలమటించి, ఏ పని చెయ్యడానికైనా సిద్ధపడే మానవునికీ తేడా ఏమీ లేదనుకున్నాడు శ్యామ్‌బాబు.

వీర్రాజు కొట్టువద్ద అదృష్టవశాత్తు అరోజు అరటిపళ్లు వున్నాయి ఆరు అరటిపళ్లు తిని, రెండు సోడాలు త్రాగాడు శ్యామ్‌బాబు అప్పు డతని మనస్సు కొంత స్థాయికి వచ్చింది ఆలోచన కొంత హెచ్చుస్థాయిలో సాగింది. మనిషి ఒక్కొక్కప్పుడు ఎంత దిగజారిపోతుంటాడో అర్థమైంది దొంగతనం చెయ్యడానికి బయల్దేరేవాడు కూడా మానవుడే! సరిగా బ్రతికే అవకాశం లేకపోబట్టి, ఆకలిబాధకు తట్టుకోలేక, అతనా పనికి దిగాడు దారిద్ర్యమంటే ఏమిటో, ఆకలి బాధంటే ఏమిటో తెలుసుకున్నవాడు, మానవత్వమున్నవాడెవడైనా, తక్కిన పనులన్నీ మానేసి ప్రజల్లోని దారిద్ర్యనిర్మూలనానికి నడుం కట్టుకొని తీరతాడు సన్యాసాన్ని స్వీకరించి, ఆధ్యాత్మిక జీవితం గడపదల్చిన మహాయోగి స్వామీ వివేకానంద. హిందూదేశమంతా పాదచారియై తిరిగి, తన జాతీయుల కష్టాల్నిచూసి, ఎంతో విచారించి, భారతదేశంయందు ఇతర దేశీయులకు సానుభూతి స్నేహం కలిగించి, భారత దేశస్థుల దారిద్ర్యాన్ని

# ఏడు కొండలు

నిర్మాణింప జెయ్యటానికి తగిన సహాయం వారినుండి పొందాలనీ, అందుకొరకు తను ప్రయత్నించాలనీ నిశ్చయించుకున్నాడు అందుకొరకు తన శక్తినంతా వినియోగించాడు

శ్యామ్‌బాబుకు వివేకానందుని బోధలంటే చాలా యిష్టం ఆరోజల్లా, శ్యామ్‌బాబు మనసులో వివేకానందుడే మెలిగాడు సాయంకాలం మిల్లునుంచి బయల్దేరి, రామవరం వూరుదాటి చాలా దూరం షికారు వెళ్ళాడు శ్యామ్‌బాబు అక్కడ కొన్ని ఎత్తైన గుట్టలున్నాయి ఆ గుట్టలమీద కెక్కి కూచున్నాడు కొద్దిదూరంలో రోడ్డువుంది అన్ని వైపులా, పొలాలూ భూములూ వున్నాయి దూరంగా, ఆకాసంవంగి భూమిని కలిసే చోటుదాకా, పచ్చని పొలాలుకన్పిస్తున్నాయి ఈ భూమి! ఈ ఆకాశం! ఈ మనుషులు! ఈ జంతువులు! వీళ్ళందర్నీ ఆవరించిన— జీవితం! అంతా కలిసి ఒకే వస్తువలోని భాగాల్లా కన్పిస్తున్నాయి ఏదో ఒక శక్తి వీళ్ళందర్నీ నడుపుతోంది! అదేమిటో తెలియదు ఒక్కొక్కప్పుడు తెలిసినట్లే వుంటుంది మరుక్షణంలో ఏమీ తెలియకుండా పోతుంది తన గురించి తెలుసుకోనీకుండా మనని అజ్ఞానంలోకీ, ఆకలిలోకీ, నిద్రలోకీ, భోగభాగ్యాల మత్తులోకీ తోసేస్తుంది ఈ అజ్ఞానాన్ని వదిలించుకొని, మనస్సును ఉన్నతస్థాయికి తీసుకు వెళ్ళినకొద్దీ, ఏదో ప్రశాంతతా, వెలుగూ, ఆనందం కన్పిస్తుంది భౌతికంగా కూడా ఒక కొండ ఎక్కితే మన దృక్పథం నేలమీద నున్నప్పటికంటే విశాలమౌతుంది కాని ఆ కొండ ఎక్కడమే కష్టం! శిఖరాగ్రాన, ఏదో అతీతమైన శక్తికి మనం దగ్గరగా వున్నట్లు కన్పిస్తుంది బహుశా భగవంతుడు అక్కడ వున్నాడేమో నని పిస్తుంది మానవుడు కష్టపడి భౌతికంగా శ్రమపడి, ఏడు కొండల్ని ఎక్కి తన వద్దకు రావాలని ఆ 'స్వామి' ఊహేమో!

రాత్రి ఎనిమిది దాటాక, నిశ్శబ్దం, చీకటీ ఆవరించిన ఆ ప్రదేశంలో ఆలోచిస్తూ, మెల్లిగా నడుచుకుంటూ ఇంటికి వచ్చాడు శ్యామ్‌బాబు రామవరంఅంతా ప్రశాంతంగా వుంది అందరూ ఆ సమయానికి తలుపులుకూడా మూసేసుకుంటారు, ఆ పల్లెటూరులో సందడి ఏమీ వుండదు

తనకోసం లలిత,చలిలో వీధులో కూర్చొని ఎదురుచూస్తుందని శ్యామ్‌బాబు ఊహించనైనా ఊహించలేదు వాళ్ళరుగుమీద కూర్చొని ఒక్కర్తీ చీకట్లోకి తనకోసం చూస్తోంది పగలల్లా శ్యామ్‌బాబు ఇంటికి రాలేదు పైగా శ్యామ్‌బాబు హోటల్లో భోజనం చెయ్యటంలేదని లలిత ఎలాగో పసి కట్టింది అందుకని ఆవాళ సాయంకాలం అతని కోసం తల్లిచేత వంట చేయించింది నిజానికి వాళ్ళ యింట్లో కూడా బియ్యంలేవు అయినా బియ్యం అమ్మేసెట్టి దగ్గరకు లలితస్వయంగా వెళ్ళి, వాళ్ళ నాన్నగారు వూరెళ్ళారనీ, తిరిగి రాగానే డబ్బిస్తామనీ, బియ్యం అరువు ఇమ్మని అడిగింది సెట్టికి లలితమీద ఎంతో అభిమానంపుట్టి, వెంటనే ఇచ్చేశాడు అందువల్ల తమకు కొన్నాళ్ళవరకూ ఇబ్బందిలేదు శ్యామ్‌బాబును కూడా ఇబ్బంది పడవద్దని చెప్దామనుకుంది అందుకనే వంటతో సహా శ్యామ్‌బాబుకోసం అంత రాత్రివరకూ ఎదురు చూస్తూ కూచుంది తమ యింటివద్దకు రాగానే శ్యామ్‌బాబుతో లలిత, "ఇంత ఆలస్యమైందేమిటి? బాబాయి! నీకోసం భోజనం సిద్ధంగావుంది. తలుపు తియ్యి తీసుకు వస్తాను" అంది

ఆమె భోజనం సంగతి ఎత్తడం వినేటప్పటికి శ్యామ్‌బాబుకు బాగా ఆకలివేసింది ఏ రకమైన అభ్యంతరం చెప్పకుండా, వెంటనే ఆమె పెట్టిందల్లా తిందామనుకున్నాడు "అలాగే లలితా ఇదుగో తలుపు తీస్తున్నాను" అన్నాడు శ్యామ్‌బాబు. అతను తలుపు తీసేసరికి తను అతనికి భోజనం తీసుకువద్దామని తమ యింట్లోకి వెళ్ళింది

శ్యామ్‌బాబు తన యింటి తలుపుతాళం తీశాడు లోపల అంతా చీకటిగావుంది లైటు వెలిగిద్దామంటే తన దగ్గర అగ్గిపెట్టెలోని పుల్లలన్నీ అయిపోయాయి లోపల వంటింట్లో అగ్గిపెట్టె వుంది అలాగే చీకట్లో తడుముకుంటూ వంటింట్లోకి అగ్గిపెట్టెకోసం వెళ్ళాడు చీకట్లో ఏమీ కన్పించటంలేదు ఒంట్లో బాగా నీరసంగా కూడా వుంది కాళ్ళకేదో అడ్డు తగిలి ముందుకు తూలిపడ్డాడు తలకు ఏదో గుచ్చుకున్నట్లయింది. "అబ్బా!" అని అరచాడు బాధతో శ్యామ్‌బాబు పడిన శబ్దం, బాధగా అరవడం, లలితకు విన్పించాయి వెంటనే చేతుల్లో లాంతరుతో శ్యాంబాబు ఇంట్లోకి పరిగెత్తుకు వచ్చింది ఆమె రాగానే శ్యామ్‌బాబు పడిన వాడల్లా లేవడానికి ప్రయత్నిస్తుండడం చూచింది తలలో అంతు గుచ్చుకుపోయిన కత్తిపీటను లాగేశాడు రక్తం బొటబొట కారిపోతోంది చాలా పెద్ద దెబ్బ తగిలింది లలిత ఆ రక్తాన్ని చూసి, "అమ్మో" అని కేకేసింది జగదాంబ కూడా పరిగెత్తుకొచ్చింది శ్యామ్‌బాబు, దెబ్బ బాధకు తట్టుకోలేక, చేత్తో తలను పట్టుకొని, "అబ్బా! అబ్బా!" అంటున్నాడు లలిత అతని దగ్గరకొచ్చి, అతనిచెయ్యి పట్టుకుని తీసుకువచ్చి ముందు గదిలో చాపమీద కూర్చోపెట్టింది శ్యామ్‌బాబు బట్టలూ, వంటింట్లో నేలా అంతా రక్తసిక్తమైపోయాయి. శ్యామ్‌బాబు గాయం బాధకు తట్టుకోలేకుండా వున్నాడు జగదాంబ, తడిగుడ్డతెచ్చి, లలితను కట్టు కట్టమంది అయినా రక్తం కారడం తగ్గలేదు. చాలా పెద్ద దెబ్బ తగిలిందనీ, అది చాలా ప్రమాదకరమైనదనీ జగదాంబ గ్రహించింది బాధకు తట్టుకోలేక శ్యామ్‌బాబుకు మొహం తిరిగిపోయింది. జగదాంబ లలితతో డాక్టరును పిలిస్తే మంచిదంది. దగ్గరలో ఏ డాక్టరూలేడు పక్కవూరిలో కొత్తగా ఒక యువకుడు యం బి బి యస్ పాసయి ప్రాక్టీసుపెట్టి, నెలరోజులయిందని ధర్మమూర్తిగారు చెప్పిన మాట లలితకు జ్ఞాపక మొచ్చింది

"అమ్మా నేనా కొత్త డాక్టర్ని పిలుచుకు వస్తానే" అంది లలిత

"నువ్వీరాత్రి ఎలా వెళ్తావ్ రామూనీ, శీనునీ లేపి పంపు"

"అది కాదే అమ్మా! వాళ్ళకు తెలియదే నేను తొందరగా పోతానే బాబాయి బాధ చూడలేకుండా వున్నానే! అమ్మా! అమ్మా!"

"అదేమిటమ్మా ఒకర్తివీ ఆడపిల్లవి ఈ చీకటిలో ఎలా పోతావు తల్లీ" అని మళ్ళీ కళ్ళ

చూసి బాధ పడుతున్న శ్యామ్‌బాబును చూసింది జగదాంబ "నే నెలాగయినా వెళ్తాను నువ్వు బాబాయిని కనిపెట్టుకుని వుండు" అని లలిత చీకట్లోకి ఒక్క పరుగు తీసింది వెనకాలనుంచి తల్లి కేక లేస్తున్నా వినక

ప్రక్కవూరంటే రెండు మైళ్ళ దూరంలోవుంది ఆ చీకటిలో, గతుకుల రోడ్డుమీద లలిత పరిగెట్టుకుంటూ వెళ్లనారంభించింది శ్యామ్‌బాబు కోసం కొంతదూరం పరిగెట్టేటప్పటికి ఆయాసం వచ్చింది మెల్లిగా నడక సాగింది ఆయాసం తీరే వరకూ ముందు రోడ్డు సరిగా కన్పించటంలేదు అయినా ఆ చీకటికి ఆమె కళ్ళు అలవాటుపడిపోయాయి ఆ రాత్రివూట పిచ్చిదానిలా ఆమె పరిగెత్తిపోతూంటే దారిపోయే తాగుబోతూ దొంగలూ ఎవరో పిచ్చిది! అనుకున్నారు కొంత దూరం పరిగెట్టాక ఆమె కాళ్ళు మరి ముందుకు సాగవేమోననిపించింది ఒక్క నిముషం ఆగి, వూపిరి పీల్చుకొని మళ్లీ పరిగెత్తింది రోడ్డు పక్కనున్న చెట్లూ, ఆ చీకట్లో వాటి నాశ్రయించివుండే దెయ్యాలూ ఆమెకు గుర్తుకు రావటంలేదు. వాటిని తల్చుకొని భయపడేందుకు ఆమెకు తీరిక లేదు ఎవరో చెప్పిన గుర్తులు జ్ఞాపక ముంచుకొని డాక్టరు గారిల్లు కనుక్కొంది.

కృష్ణమూర్తి రెండేళ్ల క్రితం యం బి బి యస్. పాసయాడు మద్రాసు స్టాన్లీ మెడికల్ కాలేజీలో ఒక ఏడాది డిమాన్‌స్ట్రేటరుగా కూడా పని చేశాడు ప్రిన్సిపాలుతో అభిప్రాయ భేదంవచ్చి ఉద్యోగానికి రాజీనిచ్చేశాడు అతని మామగారివూరు రామవరం ప్రక్కనున్న గణపవరం ఆ చుట్టు ప్రక్కల ఎక్కడా యం బి బి యస్ పాసైన డాక్టరు లేడని, అల్లుడి చేత బలవంతంమీద అక్కడ ప్రాక్టీసు పెట్టించారు కృష్ణమూర్తి మామగారు నెల రోజుల్లోనే పట్నవాసపు ప్రజలకూ, పల్లెటూరి ప్రజలకూ వున్న తేడాను కొంత గ్రహించాడు క్రిష్ణమూర్తి తన కూడాన తను వైద్యం చేసుకుపోతేచాలు పట్నవాసంలో ఫీజు ముట్టిపోతుంది పల్లెటూరులో చాలా మంది రోగం కుదిరిన తరువాత ఫీజు విషయం మర్చిపోతారు అందుకని కృష్ణమూర్తి, నిక్కచ్చిగా తన ఫీజు ముందే వసూలుచేసే పద్ధతి పెట్టుకున్నాడు వాళ్ళ కిష్టమైతేనే తనను పిలవమంటాడు

రాత్రి పది గంటలకు, "డాక్టరుగారూ! డాక్టరుగారూ!" అని పిలుస్తూ ఎవరో తలుపు బాదడం విని కృష్ణమూర్తి లేచి వెళ్లి తలుపు తీశాడు ఒక పదహారేళ్ల అమ్మాయి, "డాక్టరుగారూ! మా బాబాయికి పెద్ద దెబ్బ తగిలిందండి మీరు వెంటనే రావాలి" అని రొప్పుతూ చెప్పి తనని రమ్మని ప్రతిమాలింది కృష్ణమూర్తి ఆమెదే వూరో, దెబ్బ ఎవరికి తగిలిందో అన్నీ వివరాలడిగాడు ఈ రాత్రివూట రెండుమైళ్ళు చీకటిలో వెళ్ళాలి అయినా ఫరవాలేదు కృష్ణమూర్తికి మామగారిచ్చిన మోటారుసైకిలుంది

"డబ్బు తెచ్చావా?" అని అడిగాడు కృష్ణమూర్తి

"లేదండి" అంది లలిత తన ఆతురతలో ఆమె డబ్బు విషయమే ఆలోచించలేదు అయినా డాక్టరు ఆమాత్రం తెలివి వుండదా? అనుకొంది తరువాత ఇస్తానని చెబుదామనుకొంది

"అయితే లాభంలేదు నా 'విజిటింగ్ ఫీజు' రాత్రివూట పది రూపాయలు ఇక్కడ పెట్టి వస్తాను తరువాత అయ్యే మొత్తం ఫీజులో సగం అక్కడ ముందుగా ఇచ్చిన తరువాత 'ట్రీట్‌మెంటు' ప్రారంభిస్తాను" అని కచ్చితంగా చెప్పేశాడు కృష్ణమూర్తి.

లలిత ఆలోచిస్తూ నిలబడింది డబ్బు! డబ్బెక్కడినుంచి వస్తుంది ఇప్పుడు? తనవద్దా లేదు, శ్యామ్‌బాబువద్దా లేదు అయితే తను ఉత్త చేతులతో తిరిగి వెళ్ళిపోవలసిందేనా? లలితకు పెద్ద దుఃఖం వచ్చింది భగవాన్, బాబాయి గతి అంతేనా?

"వెళ్లమ్మాయి డబ్బు తీసుకొనిరమ్మని మీవాళ్ళెవరినైనా పంపించు" అని తలుపు వేసుకోబోయాడు డాక్టరు కృష్ణమూర్తి.

---

బక్కచిక్కిన సినిమానటుడు వెంట ఒక గొరిల్లాను తీసుకుని చిత్రనిర్మాత గదిలోకి వెళ్లాడు. నిర్మాత అతణ్ణిచూస్తూనే "ఈ కోతి నటిస్తుందనీ, పాటపాడుతుందనీ, నాట్యం చేస్తుందనీ చెప్పటానికి తీసుకొచ్చావా?" అని ఎగతాళిగా అడిగాడు.

"లేదండీ!"

"మరెందుకుతీసుకువచ్చావ్?"

"అయ్యా! ఇది నా ప్రతినిధి" అన్నాడు నటుడు.

వై. వి. సీతాదేవి, (విజయవాడ)

---

"ఆగండి!" అంది లలిత మెల్లోంచి, తాడుతో కట్టబడిన బంగారు బిళ్లను తీసింది ఆ బిళ్లను డాక్టరు చేతికిస్తూ, "ఇది తీసుకోండి. వెంటనేవచ్చి మా బాబాయిని రక్షించండి" అంది. అది లలిత చిన్నప్పుడు, ధర్మసూరిగారు ఆమెకు చేయించిన 'వెంకటేశ్వరుడి బిళ్ల! ఆమె కవచం! ఎన్ని చికాకులొచ్చినా దానిని వాళ్ళు అమ్మలేదు జగదాంబ పుస్తెలనైనా అమ్మారుకానీ, లలితకు చేయించిన వెంకటేశ్వర కవచాన్ని అమ్మలేదు

డాక్టర్ కృష్ణమూర్తి తన చేతిలోకి ఆ బిళ్లను తీసుకొని పరీక్షించాడు. దానికి ఒకవైపున ఏడు కొండలు చెక్కబడివున్నాయి రెండవ వైపున వెంకటేశ్వరస్వామి విగ్రహం వుంది సుమారు తులం బరువుంటుంది మళ్లీ మళ్లీ తిప్పిచూశాడు ఇటు ఏడుకొండలూ!—అటు వెంకటేశ్వరస్వామి! "సరే వస్తానుండు" అన్నాడు లలిత మొహం వికసించింది. "త్వరగా బయల్దేరండి డాక్టరుగారూ!" అంది

త్వర త్వరగా బట్టలు వేసుకుని, చేతిలో సంచి పట్టుకొని బయటికి వచ్చాడు. డాక్టరు కృష్ణమూర్తి. లలిత ముందు నడువ నారంభించింది లలితను ఆగమని, తన సంచి ఆమె చేతికిచ్చి, షెడ్డులోనున్న 'మోటారు సైకిలు' బయటకు తీశాడు లలితను వెనక కూర్చోమన్నాడు లలిత ధైర్యంగా కూచుంది. ఆమె సంకోచం, బెరుకూ లేకుండా ప్రవర్తించడం అతనికి ఆనందం కలిగించింది.

మోటారు సైకిలు అతివేగంగా పోతున్నా లలిత మనస్సులో 'బాబాయి పరిస్థితి ఎలా వుందో! ఇంకా వేగంగా వెళ్తే బాగుండును" అని అనుకో సాగింది మధ్య మధ్య దారి ఎలాగో అతనికి చెప్తోంది.

కృష్ణమూర్తి మనసులో, "భలేఫీజు! బంగారపు బిళ్ల! ఇటు ఏడుకొండలూ! అటు వెంకటేశ్వరస్వామి! అది తప్ప ఆ అమ్మాయి మెడలోగాని, వంటిమీదగాని ఏ విధమైన అలంకారమూలేదు. కాని ఆ అమ్మాయి మొహంలో మాత్రం ఏదో గొప్ప కళ వుంది!' అనుకోసాగాడు.

"అదుగో అదేనండి మా ఇల్లు" అని చీకటిలో అస్పష్టంగా కన్పిస్తున్న ఇంటిని చూపింది లలిత డాక్టరు గారికి.

తమ యింటిముందు మోటారుసైకిలు ఆగడంతో జగదాంబ పరిగెత్తుకుని బయటకు వచ్చింది. లలితా, ఇంకొక యువకుడు మోటారుసైకిలు దిగటం చూసింది అతను డాక్టరయి వుంటాడని గ్రహించింది "రండిబాబూ!" అని శ్యామ్‌బాబు వద్దకు తీసుకెళ్ళింది రక్తంలో తడిసిన బట్టలూ, బాధకు నిలవలేక కొట్టుకుంటున్న వ్యక్తినిచూసి డాక్టరు కృష్ణమూర్తి వెంటనే శ్యామ్‌బాబు తలకు కట్టిన గుడ్డవిప్పివేసి గాయాన్ని పరీక్షించాడు. గాయం చాలా పెద్దది ఆరు అంగుళాల పొడవుంటొచ్చు లోతు కూడా ఎక్కువగానే వుంది. మెదడుకి అపాయం కలిగిందో లేదో చెప్పడం కష్టం. అయినా వెంటనే గాయాన్ని ముందర కుట్టెయ్యాలని నిశ్చయించాడు కృష్ణమూర్తి. ఇంజక్షనొకటి ఇచ్చాడు గబగబా గాయాన్ని కుట్టేశాడు డ్రెస్సింగ్ వేసి కట్టు కట్టేశాడు మెల్లిగా శ్యామ్‌బాబుకు ధైర్యం చెబుతూ, నిద్ర పట్టేందుకు మందు కూడా ఇచ్చాడు సుమారు గంటన్నర కాలం పట్టింది. శ్యామ్‌బాబు లేస్తే ఏమేమి చెయ్యాలో, లలితకూ, జగదాంబకూ చెప్పి, మళ్ళీ తను మర్నాడు ప్రొద్దున్న వస్తానని చెప్పి వెళ్లిపోయాడు డాక్టరు కృష్ణమూర్తి శ్యామ్‌బాబు మత్తుగా పడుకొన్నాడు.

అప్పుడు జగదాంబ లలితను, డాక్టరునెలా తీసుకొచ్చిందో చెప్పమని అడిగింది లలిత జరిగినదంతా చెప్పి, డాక్టరు ఫీజు గురించి అడగడం తను వెంకటేశ్వరుడి బిళ్ల' ఇచ్చెయ్యడం చెప్పింది

"అదేమిటే, అలాంటి పని చేశావు?" అంది జగదాంబ

"మరేం చెయ్యమన్నావమ్మా ఇటు బాబాయి ప్రాణాలకోసం చూసుకుంటామా, అటు బంగారం కోసం చూసుకుంటామా?"

"అదికాదు లలితా మనకి ఎన్ని చికాకులొచ్చినా దాన్ని మనం అమ్మకూడదని మీ నాన్నగారి అభి



విక్రమ్ ప్రొడక్షన్స్ వారి "పెళ్ళితాంబూలం"లో జమున, రమణమూర్తి.

చిత్రసమీక్ష

# "పెళ్ళితాంబూలం"

చెప్పేదేదో చెప్పే తీరులో చెప్తే అందరికి సులువుగా అర్థమవుతుంది, వినేందుకు ఉత్సాహమూ కలుగుతుంది. తాతలనాటి పాత చింతకాయల కథైనా కథనం సరిగా ఉంటే విన విందౌతుంది, చిత్రిస్తే కన విందూ కూడా చిత్రించిందే విక్రం ప్రొడక్షన్స్ వారి "పెళ్లితాంబూలం"

ఓ పోలీసు కమీషనర్ రంగనాథం (రంగారావు) గారి భార్య కమలమ్మ (కన్నాంబ) ఓ బడిపంతులు గంగాధరంగారి భార్య పార్వతీ (మాలతి) మగవాళ్ళ మన మాట వినకపోతారా అన్న ధైర్యంతో తమ సంతానం రఘు, సీతల వివాహానికి తాంబూలా లిచ్చుకుంటారు ఈ ముచ్చట పూర్తిగా తీరక ముందే మగవారికి మనస్పర్థ లేర్పడటం వారితో బగువలూ, సంతానం, ఒక ఇంటికింకొకళ్ళ దూరమైపోతారు గంగాధరం తన కూతురు సీత పార్వతి ఇంకో ఊరు వెళ్తారు

పెళ్లితాంబూలం మహిమవల్ల సీత (జమున), రఘు (రమణమూర్తి) కళాశాలలో కలుసుకుంటారు క్రమంగా ఆ స్నేహలత పుష్పించి చిగురుస్తుంది. రఘు తల్లి అంగీకరించినా రంగనాథంగారు సింగినాదం వీల్లేదు పొమ్మంటాడు. కన్నె మనసుకన్న కన్న మనసెక్కువా అని రఘు ఇల్లు వదలి వచ్చి సీతను వివాహమాడ్తాడు ఇంకా ఆరువే అడుగులు పూర్తి కావాలి గనుక, తనను కాదన్నందుకు టైగరు బాబు (రాజనాల) సీతపై పగబట్టి రఘులో అనుమాన బీజాలు రేకెత్తించటం, నిజం తెలుసుకున్న రఘు టైగర్ బాబును దండించటం తత్ఫలితంగా, పోలీసు కమీషనరునని ఆవరదాకా మర్చిపోయిన రంగనాథం (రంగారావు) తన కుమారుని అరెస్టు చేయడం, తరువాత పెద్ద యుద్ధానంతరం, రఘు ఆ పిల్లదాని మెళ్లో కట్టిన "మాంగల్యబలం" వల్ల, టైగరు బాబు వాళ్లబ్బ పిసినారి పిచ్చయ్య (చదలవాడ) తో సహా కృష్ణజన్మస్థానం ప్రవేశించటం, "భార్యా, భర్తలు" (సీతా—రఘు) తమ తమ పుట్టినిళ్ళ, మెట్టినిళ్ళ వట్టింటో ఏకంకాగా గుట్టుగా జీవించటం వగైరా కథాంశాలు జరుగుతాయి.

కథెలా వున్నా కల్పనలో సొగసులు కన్పిస్తున్నాయి ఈ చిత్రం నాయకీ నాయకులు రోడ్ల మీద, ఉద్యానవనాల్లో ఆఖరికి శోభనగృహాల్లో అన్ని సినిమాల్లో మాదిరి 'కదం తొక్కుతూ పదం పాడరు ఇది సినిమా అని జ్ఞాపకం వచ్చినప్పుడు మహా అవుతే వాళ్ళిద్దరికీ తప్ప మూడో చెవికి విన్పించనంత నెమ్మదిగా, తీయగా, హాయిగా పాటలు పాడుకుంటారు. ఒకమాటలో చెప్పాలంటే వీళ్ళు అచ్చు సంసారపక్షం నాయికా నాయకులు. సీతగా జమున ఇటీవలి చిత్రాలన్నింటిలో కన్న మంచి నటన ప్రదర్శించింది. ధైర్యంగా దర్శక నిర్మాతలు తీసుకోవాలే గాని, తన సామర్థ్యానికి కొరవ లేదని రమణమూర్తి రఘుగా మరోసారి నిరూపించుకున్నాడు. పెద్దగా ప్రయోజనములేని పాత్రలే అయినా కుటుంబం, సరళలుగా రమణారెడ్డి, రాజశ్రీలు యథోచిత హాస్యాన్ని అందించారు. అంతులేని "విలనీ"తోబాటు హాస్యపు "హసి"ని కూడా కొంత ఘనీభవింప చేసుకున్న టైగరు బాబును రాజనాల రక్తి కట్టించాడు

ఈ "పెళ్లి తాంబూలం' తో వచ్చు కర్పూరం అనిసెట్టి సాహిత్యం పాటలు, మాటలు అతి సరళంగా, ఎక్కడా సభ్యతకు అభ్యంతరం కలిగించకుండా సాగాయి అన్ని పాటలూ విశ్వనాథం—రామ్మూర్తిల కమ్మని సంగీత ముస్తాబైనా, బల్ జా మజా ఆయెగా, జీవితమే ఆనందం, ప్రేమ పిండిన యిల్లు, కలయేనా అనే పాటలు పది కాలాలపాటు పనందు చేయచ్చు.

దర్శకత్వంలో శ్రీ రంగా చాల కొత్త పోకడలు పోయారు పంచబంగాళంగా ఉన్న కథకు మూర్తత కలిగించే ప్రయత్నంలో చాలావరకు కృతకృత్యులయ్యారు

విద్యార్థి జీవితాన్ని అతి పోకిరిగాను, సభ్యతారహితంగాను చిత్రించటం పరిపాటైన ఈ రోజుల్లో విద్యార్థి జీవితాన్ని, మనస్తత్వాన్ని వీలైనంత సున్నితమైన విమర్శతో, వ్యంగ్య పూర్వకంగా పరిమిత పరిధిలో చిత్రించిన శ్రీ రంగా ప్రత్యేకంగా అభినందనీయుడు

సాధారణంగా నిత్యజీవితంలో కన్పించే సన్నివేశాలతో, సరసమైన సాహిత్యంతో, వింధ్యైన సంగీతంతో, మంచి పాత్ర పోషణతో ఆంధ్రావనికి చక్కని "పెళ్లితాంబూలం" సమర్పించుకున్న విక్రమ్ ప్రొడక్షన్స్‌వారికి ఒకటి మాత్రం సందేహంగానే ఉంది పాపం !

"ఈ కాలంలో సినిమాలు తీసేవారికి మిగిలేది ఆస్తా ? అప్పా ?" నాగరాజ్ ★



అర్. యస్. బి. ఫిలిమ్సువారి 'రంగోలి'లో కిశోర్ కుమార్, వైజయంతీమాల.

# సినీవిహారం

12–వ పేజీ తరువాయి

"ఏమిటా కేకలు ?" అంటూ వచ్చింది లక్ష్మి.

"ఆ ! ఏమిటంత ఆలస్యం ? ఆకలి మండి పోతోంది" అని సూచించాడు తన కోరికను భర్త భార్యకు. ఆమె కొంటెగా "కాస్సేపు ఆగలేరూ ! ఇంట్లో ఇంకేం పని లేదనుకున్నారా ఏం ?" అని జవాబిచ్చింది.

"ఒహో ! చాలాదాకా వచ్చిందే ! ఔన్లే ! తాళం చెవులు చేతికి వస్తే ఇక మొగుడు మాట వింటారా ఈ ఆడోళ్లు !" అని చమత్కరించాడు భర్త అంజి.

"ఐతే ఇవిగో తీసుకోండి" అంటూ లక్ష్మి తాళంచెవుల్ని భర్తకి ఇచ్చేసింది తియ్యని కోపం చూపుతూ.

అంజి ఆనందిస్తుండగానే మరో నిముషానికి లక్ష్మి ఒక ప్లేటుతో ఉప్మా తెచ్చింది. "ఇదిగో రండి" అని చిన్న బల్లమీద టిఫిన్ పెడుతూ అంది.

"నాకు వద్దు" అని మారాం చేశాడు. అంజి.

"వద్దంటే వూరుకుంటా నేమిటి ?" అనే జవాబుని లక్ష్మి నుంచి వస్తుం దనుకోలేదు. అంజి

"ఏం చేస్తా వేమిటి ?" అని దబాయించాడు అంజి—భర్తగారి దర్జాతో.

ఆ ప్రశ్న అతని దగ్గర్నుంచి రాగానే లక్ష్మి అతని గడ్డం పట్టుకుని "తినిపిస్తాను" అంది నోరు తెరిపించింది. నోట్లో ఉప్మా కొంటె కృష్ణుడుగా అందుకుని మురిసిపోతున్నాడు అంజి.

హాలులోకి ఈ సమయంలోనే అకస్మాత్తుగా ఊరునుంచి రాజా వచ్చి అన్నా ఒదినల పొత్తును చూసి సంబర పడ్డాడు. సిగ్గు పడ్డాడు. తన రాకను చిరుదగ్గుతో వారికి తెలియజేశాడు. వదిన సిగ్గుల సింగారం ఒలకపోసింది. అన్న ఎగిరి గంతు వేశాడు సోఫామీద. "ఏం తమ్ముడూ !



నటి కృష్ణకుమారి.

ఇదేనా రావడం ? మరదలుపిల్లను తీసుకొచ్చావా ?" అని ప్రశ్నించాడు తమ్ముడు రాజాని.

"అప్పుడేనా చికిత్స పూర్తికావద్దూ ! ఈసారి స్ట్రాంగ్ డోస్ ఇద్దాను." అని జవాబిచ్చాడు రాజా.

ఈ అపూర్వ సన్నివేశం విజయా ప్రొడక్షన్స్ చిత్రం "గుండమ్మకథ" లోనిది. "భూకైలాస్" చిత్రం తరువాత ఒకే చిత్రంలో నాగేశ్వరరావు, రామారావులు నటించిన చిత్రం ఇదే. అంజిగా రామారావు, రాజాగా నాగేశ్వరరావు, లక్ష్మిగా సావిత్రి. ఈ సన్నివేశంలో రసవత్తరంగా నటించారు. ఈ చిత్రంలో సరోజగా జమున, రామభద్రయ్యగా ఎస్. వి. రంగారావు, గుండమ్మగా సూర్యకాంతం నటిస్తున్నారు. పై సన్నివేశంలో వెంకన్నగా వై. వి. రాజు నటించాడు. ఈ చిత్రానికి కథ చక్రపాణి, మాటలు సరసరాజు, పాటలు పింగళి వ్రాశారు దర్శకుడు : కె కామేశ్వరరావు,



విజయా వారి 'గుండమ్మకథ'లో సూర్యకాంతం, ఎన్. టి. రామారావు, నాగేశ్వరరావు, జమున.



విజయావారి 'గుండమ్మకథ'లో రామారావు, రంగారావు, సావిత్రి.



రాకలక్ష్మీప్రొడక్షన్స్‌వారి 'శ్రీదీకన్నయ్య'లో రాజసులోచన.

నీహోయ దర్శకులు : సి నాగేశ్వరరావు, కె. బాబూ రావులు కామెరా : బార్ట్లే, సౌండ్ : శివరామ్, సంగీతం : ఘంటసాల, కళ : గోఖలే కళాధర్, నిర్మాతలు : నాగిరెడ్డి, చక్రపాణి

## దైవమిచ్చిన సోదరి

మెకానిక్ రాముా ఇల్లు అది ఇంటి ముందు భాగం ప్రహరీ గోడ మధ్యలో నీడ నిచ్చే చెట్లు, కూర్చునేందుకు తిన్నె ఉన్నవి. చిత్ర అతి దీనంగా కూర్చుంది అప్పుడే ఆమెకు ఒక అపరిచితుడు పరిచయు మయాడు రక్షణ నిచ్చాడు. అతడే రాము రాముాకి ఆమె చరిత్ర అంతా తెలిసింది. వారి మధ్య సోదర ప్రేమ ఉప్పొంగింది

"వాడు నిన్ను తీసుకువెళ్లడు వాడి ప్రేమ పట్టి నీటిబుడగ లాంటిది నీళ్లలోనే కలిసి పోయింది" అని రాముా ఆమె ప్రియు డను కొంటున్న మహానుభావుడి గురించి నిజం పలికాడు.

"నాకు తెలుసు కాని, అమ్మ చనిపోయిం దన్నయ్యా! మా నాన్న పిచ్చివాడై పోయాడు. నేను దిక్కులేనిదాని నైపోయాను" అని ఆమె దీనంగా చెప్పింది.

"నువ్వేం అధైర్యపడకు నిన్ను నేను దేవు డిచ్చిన చెల్లెలుగా భావించుకుంటాను. మీ నాన్న ఎక్కడున్నా వెతికి తెచ్చి నిన్ను వారికి అప్ప గిస్తాను అప్పటివరకూ నా దగ్గరే ఉండు" అని అభయమిచ్చాడు అన్నయ్య

"నేను ఏ కొమ్మని పట్టుకుంటే ఆ కొమ్మ విరిగి పడిపోతోంది అన్నయ్యా! నేను వెడతాను. లేకపోతే నీకు కూడా కష్టాలు చుట్టుకుంటాయి" అని ఆమె తన రక్షకుడిపై జాలిపడింది.

"నన్ను గురించి నువ్వేమీ దిగులు పడక్కర్లేదు, తోపలికి పద" అని అతను ఆమెకు ధైర్యంచెప్పి వెళ్లిపోయాడే కాని, ఆమెకు తన గత చరిత్ర అంతా సినిమాలాగ కళ్లెదుట కనబడిన ఫలంగా అతి విషాదంగా 'నిషధం' లో పాట పాడుకుని బరువుని దించుకుంది.

ఈ సన్నివేశం కళాప్రపూర్ణ థియేటర్స్ చిత్రం "ఇరుగు పొరుగు" లోనిది. రాముాగా బాలయ్య, చిత్రగా కృష్ణకుమారి చక్కగా నటించారు. దర్శ కుడు ఐ. ఎన్. మూర్తి, కామెరామన్ : మల్లి, అది ఇరానీలు మంచి కోణాల్లో ఈ దృశ్యాన్ని వెండి తెరకు అందించారు. మాటలు : కొండేపూడి లక్ష్మీ నారాయణ, కళ : వాలి, నిర్మాత : చిలంకుర్తి విజయ సారధి, నిర్మాణ నిర్వహణ : జి వి కృష్ణారావు.

## సుబ్బయ్యగారి అబ్బాయి

పట్టణంనుంచి పొగబండి మీద రాజా పల్లెకు వచ్చాడు ధూమశకటం విరామ కేంద్రానికీ అతని పల్లెకు ఐదుమైళ్ల దూరం ఉంది రవాణా సౌకర్యాలేమీ లేకపోతే రెండుకాళ్లబండే ఆధారం. రైలు దిగి వచ్చి రాజా రోడ్డుమీదకు వచ్చి ఇటూ అటూ చూశాడు వాహనయోగం అబ్బేటట్టుందా లేదా అని



నవీనచిత్రవారి 'పవతికొడుకు'లో గిరిజ.



విజయా వారి 'గుండమ్మకథ'లో విజయలక్ష్మి, జమున, హరనాథ్.



లిన నటి వాసంతి బి. ఎ

# సినీ విహారం

కొంచెం దూరాన రెండెడ్లబండి కనబడింది. ఒక అబ్బాయి కూడా సారథిగా కూర్చున్నాడు ఆ బండిని కుదుర్చుకున్నాడు రాజా

బండి నడుస్తోంది పల్లె సమీపిస్తోంది ఆ చెట్లు, పుట్టలు అతనికి స్వర్గాదపిగరీయసి అనే ఆవేశాన్ని ఇస్తున్నాయి ఆ మర్రిచెట్టు, ఊడలు, చిన్న కోనేరు, కొండ ఎత్తుగా అతలతో మందిరం ఆ ప్రదేశం కనబడగానే అతని ఆవేశం పొంగి పొర్లి "ఏయ్ ! ఏయ్ ! ఆపు" అని శాసించాడు కాని ఆ సారధి "పల్లె ఇంకా కూసింత దూరాన ఉంది మారాజా !" అని వ్యాఖ్యానించాడు

"నువ్వాపరా మొగడా !" అని రాజా విసుక్కుని బండిని ఆడించాడు ఉషారుగా బండిమీంచి నేలకు ఉరికి మర్రి ఊడను పట్టుకుని ఉయ్యాల లూగి ధబాలున పడ్డాడు

ఈలోగా రథసారధి అక్కడికే వచ్చి "వచ్చిన పని అయిందా మా రాజా !" అని వెక్కిరించాడు రాజాని

"ఆ ... పద పోదాం" అన్నాడు రాజా

"ఇంతకూ ఎవరింటి కెళ్తున్నారు మారాజా !" అని అబ్బాయి ప్రశ్నించాడు

"కుమ్మరి రామయ్యగా రింటికి."

"అరెరె .. "

'అంటే "

"అదే ! మా గానుగ సుబ్బయ్యగా రింటిమీదుగా వెళ్లాలి" అని నర్చుకున్నాడు సారధి

"సుబ్బయ్యగార్ని నువ్వెరుగుదువా ?" అని ప్రశ్నించాడు రాజా ఆ బండి అబ్బాయిని

"అక్కడేగా నేను రోజూ నూనె పోయించు కునేది" అని సంబరంగా కీచుగొంతుతో అన్నాడు అబ్బాయి

"వాళ్లమ్మాయి తెలుసా ?" అని రాజా అడగకుండా ఉండలేకపోయాడు.

"సరేలెండి. పెళ్లీడు కొచ్చిన పిల్ల ఎర్రగా, బుర్రగా మా చక్కగా ఉంటుంది" అని పూరుకోకుండా "మొన్న నెవరో చూసిపోడానికి వచ్చారు" అని రాజాకి ఒక పిరికి మాత్ర కూడా వేశాడు అబ్బాయి.

ఈ సన్నివేశం నవశక్తి చిత్రంలోనిది. ఇందులో రాజాగా నాగేశ్వరరావు నటించాడు బండి అబ్బాయిగా ఎవరు నటించారో ఇంతవరకూ మీరు గ్రహించలేకపోతే ఆ చిత్రం మీ ఊరు వచ్చే వరకూ ఆగమని మనవి. దర్శకుడు రామినీడు, కామెరామన్ ఎం. కె. రాజా ఈ సన్నివేశాన్ని ఫలవంతంగా వెండి తెరపై ప్రతిబింబింప చేశారు. ఈ చిత్రానికి కథకుడు మద్గుల్కర్, మాటలు గోపీచంద్, కళ : శేఖర్, నిర్మాత : జయదేవ్, స్టూడియో వాహిని. ఈ చిత్ర నిర్మాణం ఈ నెలాఖరుకు పూర్తి కాబోతోంది ★

# హరివంశం

13వ పేజీ తరువాయి

డదు. శ్రీ కృష్ణుడీసంగతులు మాటలాడడు. అతడు వామాక్షి వివాహమును గురించి మాటలాడును. ఆ మాటలాడు పద్ధతియు వేరుగా నుండును. వివాహమన్నచో సంసారమునందలి ఒకానొకచేష్టకదా! తన భార్య మాటలాడినచో ఆచార్యాణి మాటలాడినచో, అట్లనిపించదు. భార్య మాటాడునో అతనిని అంతయు చిఱ్ఱిను, బుఱ్ఱినుగా నుండును. ఆచార్యాణి మాటలాడుచో, ఆదేశించు చున్నట్లు లుండును. శ్రీ కృష్ణుడు మాటలాడుచో అచ్చట సంసార సంబంధ విషయమున్నట్లు తెయుండదు. నిన్నునీవు దానము చేసికొనుచున్నట్లు లనిపించును. అందువలన మహానందుడధికముగ శ్రీ కృష్ణునితో నుండుటకు యత్నించును. ఒక్క దినమున శ్రీ కృష్ణుడాతనితో ఇట్లులనెను "మహానందా! నిన్ను చూచి నీవు భయపడుచున్నావు?" అని. మహానందుడేమియు అనలేదు. తరువాత ఇట్లులనుకొనెను. నన్నుచూచి నేను భయపడని దెప్పుడు! నన్ను నేను లయింపజేసుకోలేక పోవుచున్నాను. అందుకు భయపడుచున్నాను. అని మరలకొన్ని రోజులు అతడు శ్రీ కృష్ణుని మాడ లేదు. శ్రీ కృష్ణుడును అతనికి కన్పించలేదు. అసలు తాను కొన్ని దినములు ఇంటికేరాలేదు గంగ ఒడ్డులను బట్టి తిరిగెను తిరిగి ఆశ్రమమునకురాగా, నచ్చట ఎవరో కన్పించిరి. వారు రాజస్త్రీలును, పురుషులును. శ్రీ కృష్ణుడు వారితో నుండెను. సాందీపని అగ్ని గృహమున వారుండిరి. వారెవ్వరని మహానందుడు సుదాముని ప్రశ్నించెను. 'వారా! ఆయన ఉజ్జయినికిరాజు. శ్రీ కృష్ణుని మేనయత్త భర్త. ఆచార్యులు ఉజ్జయిని వారు గదా! వారిని అచ్చటకు ఆహ్వానించుటకుగా వచ్చినారు. ఆచార్య మహానందా! ఇచ్చటగూడ స్వార్థమే. ఆ దంపతులకు ఇద్దరు మగబిడ్డలు. ఒక్క కుమార్తె. వచ్చినది తమ బిడ్డలకు ఆచార్యులు విద్యాదానము చేయవలయునని అడుగుటకు. వారికి వారి బిడ్డలను కాశికి పంపుట ఇష్టములేదు. అందుకు ఆచార్యులనే ఉజ్జయినికి రమ్మనుచున్నాను. ఆచార్యు లింకను ఏమియు చెప్ప లేదు" అని సుదాముడు చెప్పెను. మహానందుడు నవ్వెను. సుదామునివంక విచిత్రముగ చూచెను. "సుదామా! ఆచార్యుడు కాశిని వదులును. మరి ఉజ్జయినికి పోవునా! ఎవరు చెప్పగలరు?" మరల మహానందుడు గంగ ఒడ్డులకు పోయెను. తిరిగి ఎప్పుడో రాత్రి ప్రొద్దుపోయిగాని రాలేదు. వచ్చినవేళకు ఇంటిలో నాతని భార్య పౌండ్రకుని మందిరమునందలి బంగారు మృగమును నిమురుచు కన్పించెను. ★

---

# మనముా-మన రాష్ట్రం

11-వ పేజీ తరువాయి

సాధ్యమైనంతవరకూ గ్రూపులు తగ్గించి, సమర్థంగా ప్రభుత్వాన్ని నడుపుకుపోవాలంటే, గతాన్ని మరచిపోయి విశాలప్రాతిపదికపై మంత్రివర్గం నిర్మించడం ఒక మార్గం. అందుకే ఢిల్లీ చర్చల సందర్భంలో ముఖ్యమంత్రి శ్రీ సంజీవయ్య, ప్రస్తుత మంత్రివర్గంలో గెలిచిన తన మంత్రులందరినీ కొత్త మంత్రివర్గంలోకి తీసుకోవాలని కోరారు. ఎవరెవర్ని మంత్రులుగా తీసుకోవాలో నిర్ణయించుకునే స్వేచ్ఛ ముఖ్యమంత్రికి ఉన్నమాట నిజమే అయినా, శ్రీ సంజీవయ్య అలాంటి కోర్కె కోరడంలో అసహజమేమీలేదు. తను కాంగ్రెస్ అధ్యక్ష పదవి చేపట్టడానికి వెళ్లేముందు, సంజీవయ్యను ముఖ్యమంత్రిగా అంగీకరించినప్పుడు తన మంత్రివర్గంలోని వారందరిని మంత్రులుగా తీసుకోమని శ్రీ సంజీవరెడ్డి కోరిన సంగతి తెలిసినదే. కొందరిని మినహాయించినా శ్రీ రెడ్డి మంత్రివర్గంలో చాలా మందిని శ్రీ సంజీవయ్య తీసుకున్నారు. ఇప్పుడు కూడా ఏదో ఒక రిద్దరిని త్రోసిరాజన్నా, తతిమ్మా అందరినీ మంత్రివర్గంలోకి తీసుకోనడం సంజీవరెడ్డి ధర్మం. శ్రీ సంజీవయ్య ఢిల్లీలో ఏ కోర్కె కోరలేదు. సంజీవరెడ్డి అంగీకరించనూ లేదు. అన్న ప్రచారం అప్పుడే ప్రారంభమైంది. ఇది ప్రతీకార దృక్పథానికి తార్కాణమేగాని మరొకటికాదు. ఒకవేళ సంజీవయ్య కోరకపోయినా, ప్రత్యర్థులను, సన్నిహితులను చేసుకోడంలోనే సహృదయత ఇమిడిఉంది. సామరస్యానికి మార్గం కూడా అదే. అంతేగాని, మూక ఉమ్మడిగా అందరిని కొట్టివేయడం జరిగితే పదిమంది బలం ఉండి, పదవులు లభించని వారు ముఠాలు కట్టడం సహజం. అలాంటిది ఈసారి జరగదనడానికి కూడా వీలులేదు. నిన్న మొన్నటి దాకా సంజీవయ్య వెనకాల ఉన్నవారు, మంత్రి పత్తములు సహా, శ్రీ రెడ్డి ముఖ్యమంత్రి అవుతున్నారనగానే, పదవులకోసం అటువైపు పరిగెత్తి, మేము ఏ వారమే అంటున్నారు. రేపు పదవులు రాకపోగానే సంజీవయ్య గాకపోయినా, మరో నాయకుడి చుట్టూ చేరడం తప్పదు. కనుక మంత్రివర్గ నిర్మాణంలో శ్రీ రెడ్డి బహు చాకచక్యాన్ని ప్రదర్శించాల్సి ఉంటుంది.

ఈమారు తప్పులు తగ్గించుకుని యథాశక్తి రాష్ట్ర శ్రేయస్సుకోసం కృషి చేస్తామని శ్రీ సంజీవరెడ్డి హామీ ఇచ్చారు. వారి హామీ అక్షరాల నిజమై, రాష్ట్రంలో సర్వ వర్గాల మధ్య సామరస్య మేర్పడి, ప్రభుత్వం సమర్థంగా సాగుతుందని ఆశిద్దాం.

* * *

లోక్‌సభ ఎన్నికలలో ఉద్దండులైన ప్రతిపక్ష నాయకులు శ్రీయుతులు కృపలాని, అశోక్ మెహతా వాజ్‌పేయీ, డాంగే, రంగా, బరూచా మొదలగు యూవన్మంది వోడిపోవడంతో అక్కడ ప్రతిపక్షాల ఎమర్శలకు తట్టుకోవడం ప్రభుత్వానికి యేమంత కష్టమైన పని కాదు. కాని, మన రాష్ట్ర శాసన సభ ఎన్నికలలో విశేషానుభవం కలిగి, పార్లమెంటరీ, వ్యవహారాలలో దక్షులనుపించుకొన్న ప్రతిపక్ష నాయకులందరూ నెగ్గారు. అంతా గొప్ప వ్యక్తులు; విమర్శనాచతురులు ఇటువంటి పరిస్థితిలో అటు ప్రభుత్వాన్ని, ఇటు ప్రతిపక్షాలను సంబాళించుకొని, సభా వ్యవహారాలను చక్కగా నడవగల సమర్థుడైన సభాపతి అవసరం.

పార్లమెంటరీ వ్యవహారాలలో పండిన జ్ఞానం కల శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు పరమపదించారు. సభాపతిగా వారులేని లోటు కొంత వరకు తీర్చవచ్చుననుకొన్న, న్యాయశాస్త్రవేత్త శ్రీ రొక్కం లక్ష్మీనరసింహదొర ఎన్నికలలో ఓడిపోయారు.

కాగా, యిప్పుడు సభాపతిగా ఎవరిని ఎన్నుకోవా లన్నది కొంత నిశితంగా ఆలోచించవలసిన విషయం కావచ్చు. కాంగ్రెస్‌పార్టీయే మెజారిటీ పార్టీ, గాబట్టి కాంగ్రెస్ అభ్యర్థి సభాపతి అవుతాడు, కావాలి. కాని, ఆ అభ్యర్థినిఎన్నుకోవడంలో కేవలం రాజకీయం చేసిన, లేదా మంత్రిపదవి నివ్వలేక సభాపతి పదవి యిచ్చి సంతృప్తి పరుద్దామని చూచినా, అదేమంత మంచి పద్ధతికాదు.

శాసనసభలో మాట్లాడడం సైతం చేతగాని, న్యాయశాస్త్ర పరిజ్ఞానం, పార్లమెంటరీ సంప్రదాయం ఏ కోశానలేని వారిని సభాపతులుగా ఎన్నుకొనడం శాసన సభకు యథోచిత గౌరవం యివ్వక పోగా, సభా వ్యవహార నిర్వహణమ అస్తవ్యస్తం చేసినట్లు అవుతుంది.

పూర్వపు శాసన సభలో శ్రీ కాళేశ్వరరావు అంతటి వారే, ప్రతిపక్ష నాయకుల సందేహాలకు, ప్రశ్నలకు ఉక్కిరి బిక్కిరి అయిన సందర్భాలు వున్నాయి. ఇప్పుడు శ్రీ తెన్నేటి, నాగిరెడ్డి ప్రభృతులు కూడా శాసన సభలో పునఃప్రవేశించారు. సుందరయ్య, లచ్చన్న ప్రభృతులు వుండనే వున్నారు. ప్రతి పక్షాల సంఖ్యాబలం కూడా బహుళంగా పెరిగింది. కొత్త తీర్మానాలకు, ధర్మసందేహాలకు పాయింట్ ఆఫ్ ఆర్డర్లకు అంతుండదు. సభాపతి గట్టివాడైతేనేగాని, సమర్థించుకొనిరావడం కష్టం. చివరకు కాంగ్రెస్ నాయకులు, కాంగ్రెస్ పార్టీవారు ఎటువంటి వారిని ఈ పదవికి నిర్ణయించి ఎన్నుకొంటారో చూద్దాం. ★

---

గమనిక : క్రిందటివారం ఎన్నికల సమీక్షలో నల్గొండ జిల్లా కమ్యూనిస్టులు కోల్పోయినట్లు పొరపాటు పడింది. 55 ఎన్నికలలో విశాఖజిల్లాలో కాంగ్రెసు 14 సీట్లు సాధించినట్లు పొరపాటు దొర్లింది. 4 స్థానాలు మాత్రమే సాధించింది.

# మనము-మన దేహస్థితి

15-వ పేజీ తరువాయి

గుణం ఇరవై రెట్లు అధికమై శరీరం బెరడు వట్టిపోతుంది.

శరీర ధాతువులు అనేక జీవకణముల కలయిక వల్ల ఏర్పడ్డవనీ, యీ జీవకణములు టిష్యూ ఫ్లూయిడ్ అనే ద్రవములో మునిగివుంటవనీ యిది వరకే తెలుసుకొన్నాము. ఈ జీవకణముల పై పొరలు (Cell wall) ద్వారా రక్తంలోనుంచి వచ్చే వస్తువులు జీవకణ శరీరంలోకీ, జీవకణంలో జరిగే కార్యకలాపంవల్ల తయారయిన వస్తువులు రక్తంలోకీ, పోతూ ఉంటవి. వేటిని పోనివ్వాలో వేటిని పోనివ్వరాదో నిర్ణయించే శక్తి జీవకణమును పరిరక్షించే పై పొరకు ఉన్నది. ఆ శక్తి అందులో ఉన్న కొలెస్టరాలు వల్లనే కలుగుతుంది. ఇది ముఖ్యంగా జీవకణ మధ్యంలో ఉన్న న్యూక్లియస్‌లో అధికంగా ఉంటుంది. ఈ పొరలన్నీ నీటిలో కరగిపోని వస్తువులతో తయారుకావాలి. కొలెస్టరాలు అటువంటి వస్తువు.

మెదడులో ఉండే అతి ముఖ్యములయిన జీవకణముల నిర్మాణంలో కొలెస్టరాలు అత్యవసరమయిన వస్తువు.

భోజనంలో కొలెస్టరాలు అత్యధిక మయినా లివరులో కొవ్వుల నుండి ఫాస్ఫొలైపిడ్లు తయారుకాకపోయినా, లివరులో కొవ్వు చేరి వ్యాధిగ్రస్తమై పోతుంది. ఆ విషయం లివరు వ్యాధులు చర్చించినప్పుడు వివరిస్తాను.

ఇంత ముఖ్యమైన కొలెస్టరాలే రక్తంలో దాని పరిమాణం ఎక్కువై పోయినప్పుడు, రక్తనాళముల యొక్క — ముఖ్యంగా ఆర్టెరీల యొక్క— లోపలి పొరల మృదుత్వాన్ని నాశనంచేసి, వాటి నునుపును పోగొట్టి, అక్కడ ఎగుడు దిగుడులు ఏర్పరుస్తుంది. ఈ స్థితిని "ఆర్టిరియో స్క్లెరోసిస్" అంటారు. "స్క్లెరోసిస్ (Sclerosis) అంటే "పెళుసుదనం". ఆర్టెరీల యొక్క పెళుసుదనమని యీమాటకర్థము. ఆర్టెరీలు రబ్బరు గొట్టములలాగే సంకోచ వ్యాకోచ శక్తి కలిగి పెద్దవీ చిన్నవీ అవుతూ ఉంటవి. ఇవి పెళుసు అయినప్పుడు ఈ శక్తి పోతుంది. వాటి గోడలలో సున్నం యింకా పెళుసు అవుతవి. ఉద్రేకముల లోనూ, కొన్ని వ్యాధులలోనూ నెత్తురుపోటు అధికమవుతుంది. అప్పుడు రక్తనాళములు సాగి పెద్దవవుతవే గాని చిట్లవు, పగలవు. ఆర్టిరియో స్క్లెరోసిస్‌లో రక్తంపోటు అధికమైతే ఆర్టెరీలు పగిలిపోతవి. ఇదే మెదడులో జరిగితే పక్షవాతం వస్తుంది.

ఆర్టెరీ లోపల పొరలు ఎగుడు దిగుడైనందున రక్తములో గడ్డకట్టించే వస్తువులు అధికంగా తయారవుతవి. రక్తప్రవాహంలో యీ ఎగుడు దిగుడులు ఒరపిడిని హెచ్చు చేసినందున, రక్తంలో ఉండే, కొన్ని సూక్ష్మకణములు నశించి రక్తం గడ్డకట్టే వస్తువులు తయారవుతవి. అన్ని అవయవములకూ రక్తాన్ని సరఫరాచేసే హృదయమే "కొరొనరీ ఆర్టెరీ" అనే రక్తనాళం ద్వారా తనకు తాను రక్తాన్ని సరఫరా చేసుకుంటుంది. ఈ నాళంలో యీ పెళుసుదనం ఏర్పడ్డప్పుడు, అక్కడ రక్తం గడ్డకట్టి, గుండెలో కండరములకు రక్తం సరఫరా కాదు. ఆ గడ్డకట్టడం అది కొరొనరీ ఆర్టెరీ ఉపశాఖలలో అయితే నొప్పితో పోతుంది. పెద్ద నాళమే పూడిపోతే క్షణాలలో మరణం సంభవిస్తుంది.

భోజనంలో కొవ్వులు అధికమైనకొద్దీ రక్తంలో కొలెస్టరాలు పరిమాణం పెరుగుతుంది. లివరు వ్యాధులలోనూ కొలెస్టరాలు పెరిగిపోతుంది. ఆహారంలో కొవ్వు పదార్థముల పరిమాణం నిర్ణయించేటప్పుడు, ఆయా వ్యక్తుల వయస్సు, వారి రక్తంలో కొలెస్టరాలు ఎంత ఉన్నది? వారికి రక్తంపోటు ఉన్నదా? తెలుసుకుని మరీ నిర్ణయించాలి. శరీరానికి అవసరమైన 'ఏ', 'డి' విటమినులు కొవ్వు పదార్థముల ద్వారా గాని సరఫరా కావు. ఏ కారణములవల్ల నయినా కొవ్వులను భోజనంలో తగ్గించినప్పుడు యీ విటమిన్లను కృత్రిమంగా తీసుకోడమో ఇవి విరివిగా ఉన్న ఇతర ఆహారములను తీసుకోడమో అవసరం. హృద్రోగమున్నవారు కొవ్వు పదార్థములను తీసుకోడం మానెయ్యాలి.

ఇంతవరకు భోజనం ద్వారా లోపలకు పోయే చక్కెరలు, కొవ్వులు, శరీరంలో వినియోగం కావడానికి లివరు ఎంత సహకరిస్తుందో తెలుసుకున్నాము. వచ్చే వారం ప్రొటీనుల వినియోగంలో లివరు నిర్వహించే విధులను వివరిస్తాను. ★

---

# సుగుణ హృదయి

9-వ పేజీ తరువాయి

అంటుకుని, నిలువునా కాలిపోయిందట. ఇతను పెరట్లో ఉన్నవాడు కాస్త ఇంట్లో కొచ్చేసరికి అంతా అయిపోయిందట. చూడు—పాపం—యివాళ మధ్యాహ్నం—ఆ కుర్రాడి నాన్న నాతో చెప్పి, కంట తడిపెట్టుకున్నాడు ....'' అంటూ ఆగింది ఆవిడ. పరాగ్గా వింటున్న సుగుణ అసలు విషయం విని, కొరడాతో కొట్టినట్టు ఉలిక్కిపడింది. ఆమె కన్నుల ముందు ఆ దృశ్యం కన్పించినట్లయ్యింది.

" .... ఇంకా నయమే—ఆ దృశ్యం కాస్త—యీ కుర్రపిల్ల చూడలేదట. చూస్తే—యిదీ ఏ ఝడుపు జ్వరమో తెచ్చుకొని, పోయేదని—ఆయన ఏడ్చాడు.'' అంటూ రత్తమ్మగారు కాండ పూర్తిచేసి, నిద్రాకాండకు ఉపక్రమించింది.

ఆ రాత్రి తెల్లవార్లూ సుగుణకి నిద్ర పట్టలేదు. అదే దృశ్యం కళ్లోకి వచ్చి కళ్లోల పరచింది. తెల్లవారి లేచేసరికల్లా ఉషకి జడ వేస్తున్న తల్లి కనుపించింది.

"ఏమే—యింతాలస్యంగా లేచావ్'' అంటూ రత్తమ్మగారు కూతుర్ని పరామర్శించి అనక "పాపం—యివాళ నుంచీ దీనికి జడెయ్యడం—బొట్టు పెట్టడం నేనే చేస్తున్నాను. అతనికి వచ్చా పాడా? పాపం, తంటాలు పడుతున్నాడు'' అంది.

"రేపట్నుంచీ మీరు వేయద్దు. సుగుణ పిన్నే వేస్తుంది'' అంది ఉష రిబ్బన్లు అందిస్తూ.

"అలాగే లేమ్మా'' అన్నారు తల్లీ కూతుళ్ళు ఏక కంఠంతో,

ఆనాటినుంచీ, తన చెల్లెలుతోపాటు జడ వెయ్యడం వంటి పనులూ, స్కూల్లో ఇంటర్వెల్లో టిఫిను పెట్టడం, మారం చేస్తే గారం చెయ్యడం, వంటి పనులూ సుగుణ సరదాగా చెయ్యసాగింది.

* * *

ఇలా కాలచక్రం మరికొన్నాళ్ళు ముందుకుసాగి, మరో చక్రాన్ని చూసి ఉలిక్కిపడింది.

ఆవేళ సోమవారం. సుగుణ సంతకంచేసి, రూములోకి వచ్చేసరికల్లా అంతకుముందే రూములో కూర్చున్న రాజారావు కుర్చీలోంచి గమ్మున లేచి, రుమాలుతో ముఖం తుడుచుకుంటూ కిటికీ వైపు వెళ్లాడు. తన రాకతో, తత్తరపడి అతను అలా వెళ్లిపోవడానికి గల కారణం తెలియక సుగుణ అతనికేసి చూసి, కుర్చీలో కూర్చుంది. రాజారావు చిన్నగా దగ్గి, తిరిగి వచ్చి తన కుర్చీలో కూర్చున్నాడు. ఆమె తల ఎత్తి చూసి అతను తనవైపే చూడ్డంవల్ల చూపు దించుకుంది.

"మ—మరండీ ....'' అన్నాడు రాజారావు.

ఆమె తలయెత్తి అతనివంక చూసింది.

—"మరండీ—హెడ్మాష్టరు — యింతకుముందే నన్ను పిలిచి ....''

"అమ్మగారూ — అయ్యగా ర్రమ్మంటున్నారు'' అంటూ ప్యూను పరుగున వచ్చాడు.

"వెళ్లిరండి—అదే నేను చెప్పబోయేది'' అన్నాడు రాజారావు కుర్చీలో వెనక్కి వాలుతూ. సుగుణ లేచి, అతన్ని అనుసరించింది.

* * *

"కూర్చోండి'' అన్నాడు హెడ్మాష్టరు కూర్చుంటున్న సుగుణను ఉద్దేశించి. పిమ్మట తలపాగా తీసి, టేబులుమీద పెట్టి తల గోక్కున్నాడు. కోటు గుండీలు క్రింద నుంచి పైకీ, పైనుంచి కిందికీ లెక్కచూసి, సరిచూసుకున్నాడు. గట్టిగా గాలి పీల్చి, విధిలేక వదిలేశాడు.

"పిలిచారుట'' అంది సుగుణ చిన్నగా.

హెడ్మాష్టరు కదలబారేడు.

"ఆ—మరేనండి—మీతో ఓ విషయం చెప్పాలి. చూడండి. లోకులు కాకులన్నారు. కాకులు ఎంగిలి వెతికినట్టు లోకులు మనలో లోట్లు వెతుకుతారు. ఆ లోటే గనక మనలో లేకపోతే — వాళ్లేమైనా చెయ్యగల రంటారా, అనగల రంటారా — అందుకని, మనం సాధ్యమైనంతవరకూ ఇతరులు వేలెట్టి చూపడానికి వీల్లేని మార్గాల్లో వెళ్లడం మంచిది—ఏమంటారు. ఇదే విషయం రాజారావుతో కూడా చెప్పాను.'' అంటూ ఆగాడు.

ఓ నిముషం సేపు నిశ్శబ్దం ఏర్పడింది.

" .... మరోటి. చాలామంది విద్యార్థులే కాక, ఉపాధ్యాయులు కూడా అనుకుంటున్నారు—కమక ...

సుగుణ లేచి నిలబడ్డంవల్ల ఆయన మాటను మధ్యలోనే ఆపేశాడు.

"క్షమించండి. ఇతరులు వేలెట్టి చూపిన

# సుగుణహృదయి

మార్గాలు తెలుసుకొని, సంచరించడం అంటే కష్టం. మన మార్గం మంచిదని నమ్మిక ఉంటే చాలు. పైగా,నే ఏ స్కూల్లో రెండేళ్ళు పైగా పనిచేస్తున్నాను కనుక, నామీద మీకు ఒక అభిప్రాయం ఏర్పడి ఉండవచ్చు. ఇంతకన్నా ఏమీ నేను చెప్పలేను. క్షమించండి—వస్తాను" అంటూ బయటికి వచ్చేసింది. తలుపులచాటున, గోడల వారనా వింటున్న ఉపాధ్యాయ శ్రోతలు ఎటు తప్పుకోవాలో తెలీక అట్టే ఉండిపోయారు.

* * *

మర్నాడు తెల్లవారింది కానీ, తెల్లవారుతూ వచ్చే ఉష మాత్రం బడ వేయించుకోడానికి రాలేదు. విషయార్థం గ్రహించిన సుగుణ — రాధకి బడవేసింది. వంటింట్లో రత్తమ్మగారికి యిదే విషయం గుర్తొచ్చి, నట్టింట్లో కొచ్చి "ఏవే! అమ్మడూ, ఉష వచ్చినట్టు కనబడదేం" అంది.

"లేదు—రాలేదు" అంది సుగుణ.

రత్నమ్మగారికి అర్థంకాలేదు. "అవునూ, ఎందుకు రాలేదంటావ్ — ఒంటికేం సలపరం తగల్లేదు కదా! — పాపం — నే వెళ్ళి చూసి ఒళిపోయొద్దునా" అంటూనే, గిర్రున వెనక్కి తిరిగి, పెరటిదారిన ప్రక్క వాటాలోకి వెళ్ళి మరో రెండు నిముషాల్లో ఉషని చేత్తో పుచ్చుకుని తీసుకొచ్చి, "ఇప్పుడే స్నానం చేసిందట. గౌను తొడుక్కుంటోంది నే వెళ్ళేసరికి" అంది.

"ఆహా" అంది సుగుణ ఆ విషయం నిజం కాదని తెలిసినా.

* * *

మరో వారం తిరిగి యింకో వారం ప్రవేశించేసరికల్లా, హెడ్మాష్టరు మరోసారి, మరో పద్ధతిలో, చెరోసారి సలహా యిచ్చాడు. ఆనాడు ఇంటర్వెల్లులో అలవాటు చొప్పున ఉష వచ్చి సుగుణ కుర్చీవైపు వెళ్ళింది. రాజారావు సర్రున కుర్చీలోంచి లేచాడు.

"ఏయ్ ! ఉషా ! యిలారా—నే పెడ్తా" అన్నాడు.

"నేరాను– నీకేం– నేను సుగుణ పిన్ని దగ్గిరే ఉంటా" అంది ఉష సుగుణ పిన్ని చేతులు పట్టుకొంటూ.

రాజారావు కోపం పేట్రేగిపోయింది.

"ఏయ్, రమ్మంటే నీక్కాదూ" అన్నాడు.

"నే రానే రాను" అంది ఉష తలూపుతూ.

"వెళ్ళమ్మ. తప్పు" అంది సుగుణ తన చేతులు విడిపించుకుంటూ. ఉష తల తాటించింది.

రాజారావు కోపం తారకస్థాయికి చేరి, కూతురు రెక్క పట్టుకుని గుంజూయించాడు. అంతే ! ఉత్తర క్షణంలో ఉష "అమ్మా" అని ఏడుపు మొదలెట్టింది తండ్రి కేసి చూస్తూ. రాజారావు బాధగా జుట్టు పీక్కుని "రా తల్లీ—మంచి దానివిగా—మనం—మంచి సినిమాకి పోదాం" అంటూ కూతుర్ని ఎత్తుకుని చకచకా వెళ్ళిపోయాడు.

సుగుణ చిన్నగా నిట్టూర్చింది.

* * *

ఆ రాత్రి భోజనాలయ్యాక, రత్తమ్మగారు అమాటా, యీమాటా చెప్పి, "అన్నట్టు, చూశావా—యీ పక్కతను యిల్లు ఖాళీ చేస్తాట్ట. మన మంచి వాళ్లకి చేదయ్యింది చూడు ఫలానా రత్తమ్మగారు ఉత్తి కూర్ఫణకమ్మ అనే పేరు లేకుండా చూసుకుందాం అని నే ననుకుంటే, ఖాళీ చేస్తాడట – చైతును- మనకేం" అంది కోపంగా. సుగుణ తల్లిచెప్పిన మాటలకు మౌనంగా తలవూపి వూరుకుంది

మర్నాడు మళ్లీ ఉష రాకపోయేసరికి, "రాపోతే పోనీ" అని వూరుకుందామని, వూర్కోలేక రత్తమ్మ గారు పక్కింటి కెళ్లింది కూతురుకి జడ వేస్తున్న రాజారావు అమెను చూసి తల వంచుకున్నాడు

"అదేవిట్నాయనా, పిల్లదానికి జడ-మే వేయ వన్నావా—అమాత్రం చేస్తే అరిగిపోములే వంపు వంపు—రావే ఉషా—రా—" అంది అవిడ ఉష లేవబోయి, తండ్రి చేతిలో జడ ఉండిపోవడం వల్ల కూర్చొబడిపోయింది.

"వద్దులెండి—మిమ్మల్ని కష్టపెట్టడం ఎందుకు —నా కెలాగూ తప్పేదిలేదు" అన్నాడు రాజారావు. రత్తమ్మగారికి పౌరుషం ముంచుకొచ్చింది. తలెత్తి చూసేసరికి, తలెత్తి చూస్తున్న రాజారావు కూడా తల దించేసుకోడం చూసి, దిగ్గున యింటి కొచ్చి, కూతురుమీద మండిపడింది.

"పిల్లదానికి జడేస్తావంటే, దానివల్ల మనకు అష్టైశ్వర్యాలూ వస్తాయనుకున్నాడు గావోలు అతను—అదే బావుంది. పోనీ—మనకేం" అంటూ గోడకి జారపడింది. ఇంతలో పక్క వాటాలో చేతి ముట్టు నరసం, వెనువెంట ఉష ఏడుపూ విన వచ్చాయి. మరో కాస్సేపటికి కళ్లు నలుపు కుంటూ వెక్కుకుంటూ ఉష వచ్చింది.

"చూశావా, పిల్ల నెలా కొట్టి చంపుతున్నాడో రామ్మా—రా" అంటూ రత్తమ్మగారు అప్యాయంగా లేచింది.

"జడ మీ రెయ్యొద్దు, సుగుణ పిన్ని వెయ్యాలి" అంది ఉష వెనక్కి తగ్గుతూ. రత్తమ్మగారు చిన్నబుచ్చుకోలేదు 'పోన్లేమ్మా—వెయ్యవే— పాపం' అంటూ వంటింటివైపు నడిచింది.

* * *

ఆనాడు సాయంత్రం నాలుగున్నర అయ్యింది. ఉష ఎగురుకుంటూ వచ్చి, గుమ్మం పక్కన కూర్చుని, కాఫీ తాగుగుతున్న సుగుణ మెడ చుట్టూ చేతులు నేసి తలమీద ముద్దు పెట్టుకుంది.

"ఏమే వెకిలిపిల్లా— ఏమ్టి సంగతి—మరీ హెచ్చుమీ దున్నావ్. సినిమా కెళుతున్నారా—యింద కాఫీ" అంటూ రత్తమ్మగారు కాఫీ అందించింది. "లేదు" అంది ఉష కాఫీ అందుకుంటూ "మరి" అందావిడ

"చెప్పనా" అంది ఉష తల్లీ కూతుళ్లకేసి చూస్తూ.

"వూ" అన్నా రిద్దరూ.

ఉష కాఫీ తాగి, గ్లాసు కిందపెట్టి "మరేం— నాకు — అమ్మొందిగా — అందుకని, యింక నే నెప్పుడూ ఏడవను" అంది. సుగుణా, రత్తమ్మ గార్లు ఆశ్చర్యపోయి ఒకళ్ల ముఖా లొకళ్లు చూసుకున్నారు కాస్త పెందలాళే ఆశ్చర్యంలోంచి లేచిన రత్తమ్మగారు, "మళ్లీ పెళ్లి చేసుకుంటు న్నాడు గావోల్ను" అంది కూతురుకేసి చూస్తూ.

# సుగుణ హృదయ

సుగుణ ఏమీ అనలేదు. రత్నమ్మగారు కాఫీగ్లాసు కిందపెట్టి "ఎప్పుడూ — మీ అమ్మెవరో నీకు తెలుసటే" అంది.

"ఓ! తెలుసు — చెప్పనా" అంది ఉష నవ్వుతూ.

"చెప్పు" అందావిడ

ఉష గమ్మున లేచి, సుగుణ వెనక్కి వెళ్లి రెండు చేతులూ ఆమె మెడ చుట్టూ వేసి, ఊపుతూ, "మరేం—మా అమ్మ-సుగుణ పిన్ని మా అమ్మట"అంది సుగుణను వూపుతూ సుగుణ ఉలిక్కి పడింది రత్నమ్మగారు ఆశ్చ్టే ఉండిపోయింది. ఆ నిశ్శబ్దాన్ని చూసిన ఉష సుగుణను వదలి నిల బడిపోయింది సుగుణ దిగ్గున లేచి ముందుగది లోకి వెళ్ళిపోయింది ఈ పరిస్థితి అర్థంకాని ఉష, రత్నమ్మగారు పూర్తిగా తేరుకొనేలోగానే, ముందు గదిలోకి వచ్చింది యింటికెళ్లిపోదామని

"ఏయ్! ఉషీ — యిలా రా" అంది మంచంమీద కూర్చున్న సుగుణ ఉష భయపడుతూ ఆమె వద్దకు వెళ్లింది సుగుణ కళ్ళు చింతనిప్పుల్లా ఎర్రబడ్డాయి ఆమె రెండు చేతుల్ని ఒక చేత్తో పట్టుకుని, గుంఝాయిస్తూ "నన్ను అమ్మ అనమని ఎవరు చెప్పారు? మీ నాన్నగారేనా" అంది రెండోచెయ్యి లాటిస్తూ. ఉష బిక్కచచ్చి పోయి, తల అడ్డంగా వూపింది.

"మరెవరు? నిజం చెప్పు" అంది సుగుణ

"మరేం — పిన్ని — నువ్వు మా అమ్మవనీ, పెద్ద స్కూల్లో మేష్టారు చెప్పారు. నిజంకాదా" అంది అమాయికంగా. సుగుణ ఆమె చెయ్యి వదిలేసి, "సరే—వెళ్ళు" అంది అప్పుడే పక్క గడపలో కాలు పెడుతున్న రాజారావు యీ మాటలు విని, విషయం అర్థం చేసుకుని, బయటకు రాబోతున్న కూతురి రెక్క పుచ్చుకుని, బలంగా వీపుమీద రెండు బాదాడు ఉష ఏడుపుతో ఉలిక్కిపడి, లేచి గడప దగ్గరికి వెళ్ళే సరికి, రాజారావు కూతుర్ని మరో నాలుగు బాదులు బాది బరబర లాక్కుని వెళ్లిపోయాడు సుగుణ బాధగా నిట్టూర్చి మంచంమీద కూలబడిపోయింది.

* * *

ఆ మర్నాడు ఉష జడ వేయించుకోడానికి రాలేదు. అప్పుడే పక్కింటినుంచి తిరిగొచ్చిన రత్నమ్మ గారు, "పాపం—పిల్లదానికి జ్వరం — పెనంలా కాలి పోతోంది — రాకేం—చేస్తుందిలే — ఒకలాకొట్టి చంపుతుంటే" అంది సుగుణ మౌనంగా తలూపి, వూరుకుంది

ఉషకి, పంతంతోపాటు జ్వరం, జ్వరంతోపాటు పంతం ఎక్కువయి, ఓ వారం, పదిరోజులు తిరిగేసరికి "టైఫాయిడు" అనిపించింది

"టైఫాయిడుటా" అంది రత్నమ్మగారు..

సుగుణ ఉలిక్కిపడింది

"పాపం ఓసారి వెళ్లి చూసిరద్దూ" అంటూ ఆవిడ వంటింట్లోకి వెళ్లిపోయింది సుగుణ లేచి, పక్కవాటా వైపు వెళ్లింది.

హాల్లో మంచం పక్కన కుర్చీలో కూర్చుని, పేపరు చదువుతున్న రాజారావు సుగుణను చూసి దిగ్గున లేచి "ర—రండి కూర్చోండి" అన్నాడు.

సుగుణ తిన్నగా ఉష దగ్గరికి వెళ్ళి, నుదురుమీద చెయ్యి వేసి చూసింది జ్వరం పెరిగిపోతోంది "అమ్మా" అంటూ ఉష కళ్ళు తెరిచి చూసింది

"ఏం—ఉషా—తల నెప్పిగా ఉందా—జ్వరం తగ్గిపోతుందిలేమ్మా" అంది తప్పును సరిచేస్తూ. ఉష మళ్ళీ అమ్మా అంటూ కళ్ళు మూసుకుంది

"డాక్టరు ఏమన్నాడు" అంది ఆమె రాజారావు నుద్దేశించి అతను నిస్పృహగా నవ్వాడు

"డాక్టర్లు — ఏవీ అనరు, అనలేరు కూడా— అయినా జబుల్ టైఫాయిడులో దించవచ్చు అంటున్నారు" అన్నాడు అతని కంఠం వెలుగు దాసింది "గీతని తప్పించే దేవుడు — నుదుటిరాతలా ఉంటే అలా జరగాల్సిందే" అన్నాడు బొంగురు గొంతుతో సుగుణ కళ్ళలో నీరు సుడులుతిరిగి కొలకుల్లో నిలిచింది. రాజారావు గొంతు సరిచేసుకున్నాడు "అన్నట్టు—మీతో ఓ విషయం చెప్పాలి అనవసరంగా మీ మనస్సును పాడుచేసినందుకు నేను చాలా విచారిస్తున్నాను దాని కా మాటలు ఎవరో మేష్టర్లు చెప్పారట— పోతే, ఆ మాటలు నే వినిపించానని మీరు అనుకోకుండా ఉంటే అదే చాలు ఇక, నాలుగైదు రోజుల్లో ఇల్లు కూడా మారబోతున్నాం. దొరకా అనుకోండి" అన్నాడు అతని మాటలకు ఏమని సమాధానం చెప్పాలో తెలీక, ఆమె తల వంచుకుని, విని వచ్చేసింది.

* * *

ఉష జ్వరం నాలుగైదు రోజుల వరకూ తగ్గుముఖం పట్టకపోయినా, టయిఫాయిడ్ గడి దాటలేదు. ఈ నాలుగైదు రోజుల్లోనూ సుగుణ రోజుకి ఒకసారైనా ఉషను చూసేది.

ఆవేళ రాజారావు స్కూలుకు వచ్చాడు. రత్నమ్మగారికి కొంచెం అస్వస్థతగా ఉండడంవల్ల సుగుణ మధ్యాహ్నం శలవుపెట్టి యింటికి వచ్చింది రత్నమ్మగారు కాస్సేపు అపసోపాలు పడి, సన్నగా నిద్రించింది మరో కాస్సేపటికి లేచింది ఇంతలో రాజారావు తండ్రి వచ్చి "కొంచెం అమ్మాయిని చూస్తుంటారా, యిప్పుడే వస్తా" అన్నాడు "హాలాగే" అంది రత్నమ్మగారు ఆవులించి, చిటికెలు వేస్తూ. ఆయన అలా వెళ్ళగానే సుగుణ లేచి పక్క వాటాలోకి వెళ్ళింది పక్కమీద ఉష సుగుణను చూసి, నీరసంగా నవ్వింది సుగుణ కుర్చీలో కూర్చుంటూ, "ఏం ఉషా, చూశావా— జ్వరం తగ్గిపోయింది, రేపటికి మరి తగ్గిపోతుంది" అంది.

"మరేం—అసలు జరమెందు కొచ్చిందో తెలుసా" అంది ఉష. సుగుణ తల ఊపింది.

"మరేం .... నిన్ను అమ్మా అన్నానని, నాన్న నన్ను చావ బాదేడుకదూ, అందుకని సుగుణ కళ్ళలో నీరు సుడి తిరిగింది.

"ఏం పిచ్చి, కోపం వచ్చిందా—పోన్లే నాన్నతో చెప్పక — మళ్ళీ తంతాడు" అంది సుగుణ మౌనంగా కన్నీళ్ళు పైట చెంగుతో తొత్తుకుంది

"పోనీ—ఓ టడగనా!"

"ఏమిటి" అంది ఆమె

"మరేం. మా అమ్మొచ్చేదాకా — నిన్ను అమ్మా అని పిలవనా—ఏం—ఉత్తినేపిలవడవేగా—ఏం—మరి నా కన్నులు అమ్మ లేదుగా పిం — పొద్దా. పోనీలే, నేనూ మా అమ్మ దగ్గరి .

"తప్పు—అలా అనకూడదు" అంది సుగుణ గమ్మున ఆమె నోటికి చెయ్యి అడ్డం పెడుతూ.

"మరి చెప్పు—పిలవనా వొద్దా—చూడు— ఇంత పెద్దదానివి నీకున్నాదా అమ్మ్యంది మా నాన్నకీ ఉందిట నాకు లేదు. రాధకి కూడా ఉంది" అంది ఉష ఆమె చేతిని విడిపించుకుంటూ

"ఏం? పిచ్చి—వొద్దా—పోన్లే—ఉత్తినే పిలుస్తే ఏమ్మా—మా అమ్మయితే అలా అనదు నేను మా అమ్మ దగ్గరికే పోతా" అంది హీనమైన గొంతుకతో సుగుణ కన్నీళ్ళని పైట చెంగుతో తుడుచుకుంటూ లేచి, "ఇప్పుడే వస్తానే ఉషా" అంటూ వచ్చేసింది నిద్రమత్తు పూర్తిగా వొదిలిన రత్నమ్మగారు కూతుర్ని చూసి "ఏమే—ఎలా ఉంది దానికీ, నే వెళ్ళి కూర్చోనా, నిద్ర పోతోందా" అని అడిగింది కానీ సుగుణ ఏవీ సమాధానం ఇవ్వకపోయేసరికి, "అదేమిటే" అంటూ లేచింది.

* * *

పక్కమీద పడుకున్న సుగుణకి తన గత జీవితం—దిన్మతనం. తన అయిదో ఏట—తండ్రి లారీ క్రింద పడి చనిపోవటం "నాన్నా—అమ్మా— నాన్న కావాలి" అని తను ఏడవడం, తల్లి సముదాయించడం అన్నీ గుర్తుకు వచ్చాయి.

"నాన్నా—అమ్మ కావాలి" అన్న ఉష రూపం ఆమె కళ్ళయెదుట నిలిచింది.

"అమ్మా" అనుకుం దామె కన్నీటిని తుడుచుకుంటూ.

ఆ రాత్రంతా ఆమెకు ఉషా, ఆమె మాటలే గుర్తుకు రాసాగాయి "అమ్మా అని పిలవద్దా" అంటున్న ఆమె కంఠం వినిపించింది ఉలిక్కిపడిన సుగుణ కళ్ళు నులుముకుని చుట్టూ చూసింది. అప్పుడే పన్నెండు గంటలు కొట్టింది గడియారం

సుగుణ లేచి కూర్చుంది ఆవులించింది ఆమె మనస్సు నేయి మనస్సుకి అలోచనలు ఇచ్చింది. పక్కమీంచి లేచి, గదిలో పచార్లు చేయ నారంభించింది. మళ్ళీ పక్కమీద కూర్చుంది. ఓ నిముషం అయ్యాక మళ్ళీ లేచి, లైటు వేసి కిటికీలోంచి బయటికి చూసింది పక్క వాటాలో లైటు వెలుగు కనిపించింది ఆమె మనస్సు ఉష మీదికి పోయింది మెల్లిగా లేచి, తలుపు తెరుచుకుని వసారాలోకి వచ్చింది పక్క కిటికీ కర్టెను లోంచి కుర్చీలో కూర్చున్న రాజారావు కనుపించాడు

రాజారావు కుర్చీలో కూర్చుని, కన్నీరు మున్నీరుగా, మౌనంగా విలపించడం చూసింది ఆమె కళ్ళవెంట నీరు గిర్రున తిరిగింది అలాగే నిలబడిపోయింది ఇంతలో ఉష లేచి, పక్కమీద కూర్చుంటూ" నాన్నా" అంది రాజారావు ఉలిక్కిపడి, "ఏమిటమ్మా" అన్నాడు ఏమిటమ్మలో అమ్మ శబ్దం— ఉషకి అమ్మని గుర్తుచేసింది "అమ్మ కావాలి" అంది వెంటనే రాజారావు పిడికిలితో నుదురు బాదుకున్నాడు.





# సుగుణ హృదయం

"పోనీ, అమ్మొచ్చేదాకా—సుగుణపిన్ని నన్నా అమ్మా అని పిలవనియ్యి" అంది ఉష

"ఛప్—నోర్ముయ్" అన్నాడు రాజారావు వెంటనే శృతి తగ్గించి "తప్పమ్మా అలా అన కూడదు ఆవిడకి కోపం వస్తుంది తప్పు" అన్నాడు కూతుర్ని బుజ్జగిస్తూ

"ఊం వొద్దు అయితే నేమా అమ్మ దగ్గిరికి పోతా" అంటూ ఉష గిలగిల్లాడింది. రాజారావు చిన్నగా మూల్గి కుర్చీలోంచి లేచాడు బయట నించున్న సుగుణ అతనికి గమ్మున కనబడే సరికి "ఆ—ఎవరు" అంటూ తలుపుతీశాడు.

"నేనే" అంది సుగుణ చిన్నగా

"మీరా" అన్నా డతను ఏవనాలో తెలీక

సుగుణ మారు మాట్లాడకుండా లోపలకు వచ్చింది ఆమెను చూస్తూనే "అదిగో—పిన్ని వచ్చింది ఏం పిన్నీ—పిలవనా వద్దా" అంది

"ఛస్" అన్నాడు రాజారావు

సుగుణ ఉష నుదురుమీద చెయ్యివేసి, "ఏం ఉషా—ఎలా ఉందమ్మా" అంది చిన్న గొంతుతో.

"నాకేంలేదు—తగ్గిపోయింది గానీ—నిన్ను అమ్మా అని పిలవనా వొద్దా—మా అమ్మ దగ్గిరి కెళ్లిపోనా" అంది దగ్గుతూ

రాజారావు బాధగా ఊగిసలాడాడు

"చెప్పు వొద్దంటే మా అమ్మ దగ్గిరి కెళ్లిపోతా—రేపిపాటికి" అంది భయపెడుతున్నట్టు. సుగుణ కళ్లు గట్టిగా మూసి, తెరిచింది. టపటప రెండు చినుకులు ఆమె కళ్లనుంచి రాలి, ఉష తల మీద పడ్డాయి

"వొద్దా—పిలవనా" అంది ఉష మళ్లీ—లేచి సుగుణ భుజాలు పట్టుకుని వూపుతూ

"ఉషా" అంది ఆమె ఉషని కౌగలించుకుని

"అమ్మా" అంది ఉష వెంటనే మళ్లీ "పిలవనా" అంది అనుమానంగా

"పిలు—నేనే నీ అమ్మను" అంది ఆమె ఉషను మరింత గాఢంగా హత్తుకుంటూ. రాజారావు స్తబ్ధుడై పోయాడు.

"ఏ—ఏవండీ ...." అన్నాడు.

"అమ్మా—నాన్నా—పిన్ని వొప్పుకుంది" అంది ఉష ఆనందంతో

సుగుణ పైట భుజం చుట్టూ తిప్పి, మొలల్లో దోపుకుంటూ, "క్షమించండి, తండ్రిలేక నేను పడ్డ బాధ—నాకు తెలుసు తల్లిలేని బాధ వూహించగలను" అంది

రాజారావు అలాగే ఉండిపోయాడు

"అమ్మా—నాన్నా—అమ్మ" అంది ఉష ఏవనాలో తెలీక

"అవునమ్మా, నేనే మీ అమ్మను మీ మేష్టారు చెప్పినట్టు దేవుడు నన్ను పంపేడు" అంది ఉషను అక్కున చేర్చుకొంటూ ఆమె

"నిజంగానా ? నాకు తెలుసు మేష్టర్లు అబద్ధం ఆడరు" అంది ఉష ఆనందంతో సుగుణ మెడ చుట్టూ చేతులు వేస్తూ

రాజారావు కళ్లల్లో నీరు సుడులు తిరిగి కొంకుల్లో ఆగింది

సుగుణ కన్నీరు తుడుచుకుని, ఉష తల నిముస్తూ నిట్టూర్చింది. 

# గళ్ళనుడికట్టు - 94



## అడ్డం

1. హృదయములో జాగ్రత్త !
3 కపిలమహర్షి పేరులో కేశ విశేషమా ?
5 లోకం అగి సగం, లో సగం తీసేస్తే యుద్ధం.
7. శత్రువు.
9 ఖండించుము.
12 దుఃఖము.
13 శబ్దములో అలుపు !
15 తొందరపాటు
17 కమలములో తురక, మూకుడు దాక్కున్నాయి!
19 ఇంటొక్కడి.
20 మోసగాడా ?
21. రాయించేది.
23 ఐరావతములో ధ్వని తధ్యము !
25. కింద.
28 స్త్రీ.
30 ఒక రకమయిన పాత్ర.
31 గోల !
34 ఫలించని ఆశ.
38 అంకురము.
39 పేరు !
40. మనుష్యు

## నిలువు

1 పొగ సగం మార్చినా అదే !
2 సుగంధద్రవ్యమా ?
3 బంధువులు, చిందరవందర అయ్యాయి.
4 బంగారు, సీసము.
5 ఒక రకం తాడు.
6 తాళ్ళు కాదు !
7 నది.
8 రాజా అమ్మడు అందుకని విటుడౌ కావాలి!
10 తిరిగి !
11. మర్యాద కారం గుణం కల దానితో ఉంటుందా?
12 వర్ణము
14 దీపానికి అవసరమా ?
15 వ్యర్థ వ్యయము
16 కుటజము తగ్గిస్తే చెట్టు, గుడిసె.
17 బావకంటె చిన్నవాడు !
18 పాత్ర వడకము అంటే కనిపిస్తుందా ?
22 పడవ తలక్రిందులు !
24 ఆవల జట్టులో భూమిపైరు ఉన్నాయి.
26 ఒక పెద్ద పండు !
27. వర్షము.
29 మిక్కిలి తలక్రిందులుగా
30 భాష
32 కత్తులలో పిరాణి
33 సామెత తలకిందు అయింది !
34 బాణము, కత్తి, విల్లు !
35 వెన్నం.
36 తలకిందు అయిన అర్ధనాదము
37 భయం !



## 93-వ గళ్ళనుడికట్టుకు జవాబు



సత్యానందంగారు హోటల్ కి వెళ్ళి ఫలహారం కానిచ్చారు. సర్వర్ బిల్లు ఇచ్చాడు. దాని మీదఉన్న అంకెలు చూసేసరికి ఆయనకు చెమటలు పోశాయి. సర్వర్ ఆయన స్థితిచూసి నవ్వుకుని "ఆబిల్లు ఇటు తేండి, లెక్క సరిగ్గా వెయ్యలేదు!" అని చెప్పి తీసుకున్నాడు.

కె. ఎస్. సుబ్రహ్మణ్యం (మద్రాసు)

# న్యూఢిల్లీ లేఖ

7—వ పేజీ తరువాయి

కలలు కంటున్నారు. శ్రీ మెహర్‌చంద్ ఖన్నా ఇప్పు డెలాగూ మంత్రిగా ఉంటున్నారు కనుక మరొక మంత్రి పదవిని కూడా ఢిల్లీ ప్రతినిధికి ప్రధానమంత్రి కట్టబెడతారా అన్నదే సమస్య ఏమైనప్పటికీ ఈయన, శ్రీ శివచరణ్ గుప్త, శ్రీ బ్రహ్మప్రకాష్ అనుయాయులే కాబట్టి, కొత్త పార్లమెంటులో శ్రీ బ్రహ్మప్రకాష్ వేసే ఎత్తును వీరుభయులు బలపరుస్తారు

నేను ఇదివరకే మనవి చేసినట్లు ఢిల్లీ సమస్యకు ఒక్కటే పరిష్కార మార్గం ఉన్నది పంజాబ్, ఉత్తర ప్రదేష్ రాష్ట్రాల నుంచి ఇదివరలో విడదీసి ఢిల్లీలో కలిపిన ప్రాంతాలను మళ్లీ ఆ రాష్ట్రాలలో విలీనం చేసి న్యూఢిల్లీ కేంద్ర పాలితంగా రూపొందించటమే ఆ మార్గం ఆ కొద్ది కాలం మనలేకపోయిన ఢిల్లీ రాష్ట్రంలో అధికారాన్ని చవిచూచిన శ్రీ బ్రహ్మప్రకాష్, ఆ రాష్ట్రం ముక్కలయ్యే వరకూ మళ్లీ అక్కడ ప్రజాస్వామ్యం పేరుతో చెలామణి అయ్యే వ్యవస్థను ఏర్పాటు చెయ్యాలని వత్తిడిచేస్తూనేఉంటారు

* * *

వైద్యులు రోగి ఆరోగ్యాన్ని గూర్చి చేసిన ఒక ప్రకటనను సవరించి ప్రచురించవచ్చునా అనే విషయమై ఇక్కడ వాదోపవాదాలు జరుగుతున్నాయి రాష్ట్రపతి డా రాజేంద్రప్రసాద్‌ను ఇటీవల పరీక్షించిన వైద్యులు, ఆయన ఆరోగ్యం మునుపటికన్నా మెరుగ్గా ఉన్నదని, అయితే చూపు మాత్రం ఇంతకు మునుపు ఎలా ఉన్నదో ఇప్పుడూ అలాగే ఉన్నదని వివరిస్తూ ఒక ప్రకటన చేశారు ఈ ప్రకటనమీద వారు సంతకాలు కూడా చేశారు అయినప్పటికీ రాష్ట్రపతి భవనం నుంచి వెలువడిన ప్రకటనలో రాష్ట్రపతి చూపుకు సంబంధించిన వివరాలు మారిపోయాయి!

ఢిల్లీ నగరంలో అగ్రశ్రేణికి చెందిన వైద్యులు జారీచేసిన ఈ ప్రకటనను సవరించే అధికారం ఎవరికైతేనేమి ఉన్నదా? అన్న విషయం ఇప్పుడు చర్చనీయాంశం అయింది వైద్యుల ప్రకటనను పూర్తిగా మార్చివేసేట్లయితే, అసలు నిర్ణీత వ్యవధుల్లో రాష్ట్రపతిని పరీక్షించవలసిందని వారిని కోరటం దేనికి? తీరా వారు పరీక్షించిన తరువాత వారి ప్రకటనను సవరించటం దేనికి? రాష్ట్రపతి సత్యాహింసలను ఆరాధిస్తారు. మరి ఈ జరిగిన మార్పులను వారి దృష్టికి తెచ్చి, ఇందుకు బాధ్యులైనవారిమీద తగు చర్య తీసుకునే అవకాశం కల్పిస్తున్నారో లేదో తెలియదు

* * *

కేంద్ర మంత్రివర్గంలో ఉండవలసిన సభ్యులను గూర్చి అప్పుడే రగడ ప్రారంభమైంది మంత్రివర్గం ఎన్నిక ఒక గొప్ప కళ అన లింత వరకు ప్రధాన మంత్రి నూతన మంత్రివర్గంలోకి ఎవరెవర్ని తీసుకోవాలో ఆలోచించనేలేదు కాగా వివిధ శాఖలలో మార్పులు కూడా అవసరం, ఉదాహరణకు వాణిజ్య పరిశ్రమల శాఖనే తీసుకోండి ప్రస్తుతం ఈ శాఖలో వాణిజ్య పరిశ్రమల విభాగాలే కాక, ప్రభుత్వ రంగంలోని పరిశ్రమలు, కంపెనీ లా విభాగం కూడా చేరి ఉన్నాయి ఇకమీదట కూడా ఈ శాఖను ఇలాగే ఉంచాలో, రెండుగా విభజించాలో, పునర్వ్యవస్థీకరించాలో ప్రధాన మంత్రి నిర్ణయించుకోవాలి. మిగతా శాఖలు కూడా ఈ తీరుగానే ఉన్నాయి. సచివాలయ పునర్వ్యవస్థీకరణకు తగు సూచనలు చేయవలసిందని కాబినెట్ కార్యదర్శి శ్రీ విష్ణు సహాయ్‌ని ప్రధాన మంత్రి త్వరలో కోరుతారని ఆశించవచ్చు

* * *

పార్లమెంటు ఏటా చేస్తున్న శాసనాలు ఎన్ని అమలు అవుతున్నాయో, వాటి ఫలితాలు ఎలా ఉన్నాయో పరిశీలించటం ప్రయోజనకరం కాగలదు ఉదాహరణకు 1956 లో ఆమోదింపబడిన నదీ మండలుల శాసనాన్నే తీసుకుందాం. భారత రిపబ్లిక్ ఏర్పడిన ఏడేళ్లకు ఈ శాసనం తయారైంది "కేంద్ర ప్రభుత్వం గెజెట్ ప్రకటన ద్వారా నిర్ణయించే తేదీ నుంచి" ఇది అమలులోకి రావాలి భారత రిపబ్లిక్‌కు ఇప్పుడు పదమూడేళ్లు నిండాయి ఇంతవరకు ఈ చట్టాన్ని అమలుచేసే గెజెట్ ప్రకటన వెలువడలేదు! నీటి పారుదల శాఖ కార్యదర్శి శ్రీ ఎం ఆర్ సచ్‌దేవ్ మాత్రం ఈ చట్టానికి పట్టిన దుమ్ము కొంత వరకు దులిపారు మహానది, మాహి, నర్మదా, తపతి నదుల ఆయకట్టులకు నదీ మండలులు ఏర్పరిచే విషయమై ఆమోదం తెల్పవలసిందని కోరుతూ ఆయా రాష్ట ప్రభుత్వాలకు ఆయన లేఖలు వ్రాశారు అంతరాష్ట్ర నదుల వినియోగాన్ని క్రమబద్ధం చేసేందుకుగాను ఈ నదీ మండలులు ప్రభుత్వాలకు సలహాలు యిస్తాయి

నదీ మండలులకు దిగువ పేర్కొన్న విధులలో అన్నీ గాని, కొన్ని గాని నిర్వహించే అధికారం ఉంటుంది

(ఎ) అంతర్రాష్ట్ర నదుల వినియోగాన్ని క్రమబద్ధం చేయటంలో గాని, నదీ లోయలను అభివృద్ధిపరచటంలో గాని ఆయా రాష్ట్ర ప్రభుత్వాలకు సలహాలు యివ్వటం; వివాదాలు ఏర్పడకుండా ఉండేందుకు వారు నిర్వహించే కార్యక్రమాలను సమన్వయ పరచటం ఇందుకు నదీ మండలులు దిగువ చర్యలు తీసుకోవచ్చు

(1) అంతర్రాష్ట్ర నదులను అదుపులో ఉంచి, గరిష్ఠ ప్రయోజనం సాధించటం.

(2) నీటి పారుదల, మురుగు పారుదల పథకాలను తయారు చేయించి అమలు చేయించటం.

(3) జల విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి పథకాలు తయారు చేయించి అమలు చేయించటం.

(4) వరద నిరోధక పథకాలు రూపొందింపజేసి అమలు చేయించటం

(5) నౌకాయానవసతులు అభివృద్ధి పరచటం.

(6) అటవీ సంపదను వృద్ధిపరచి, భూపారాన్ని సంరక్షించటం

(7) అంతర్రాష్ట్ర నదుల నీరు కలుషితం కాకుండా తగు చర్యలు తీసుకోవడం.

(8) అవసరమని తోచిన ఇతర చర్యలు తీసుకోవటం. ★

# యువ ప్రపంచం

## కథల్లో నిజం

మీరు ప్రచురించే కొన్ని కథలు చదివిన తర్వాత నాకొక ఆలోచన కలిగింది. ఈ కథలు హాస్యరస ప్రధానమైన వయినప్పటికీ అందులో కొంత నిజం లేకపోలేదు. ముఖ్యంగా ఇరవై సంవత్సరాల కిటూ అటూ వయస్సుకల యువకులకు అమ్మాయిలంటే లోపల ఎంత భయమో ఈ కథలు సూచిస్తాయి. నలుగురైదుగురు కలిసి ఒక విద్యార్థిని ఏడిపించొచ్చు; అది వేరే సంగతి. కాని, ఒక అబ్బాయి ఒక అమ్మాయితో మాట్లాడటమంటేనే ఎంత జడుస్తాడో ఈ రకం కథలు ఇంచుమించు నిజంగా తెలుపుతాయనిపిస్తుంది. ఆఖరున, పెళ్ళి అయిపోయిన తర్వాత, అసలు సంబంధమే మారిపోయి భర్త ఎంతైనా "అధారిటీ" చలాయించొచ్చు. అంతవరకు మాత్రం అమ్మాయిలాంటి అబ్బాయికి భయమనటం 'నగ్నసత్యం'.

ఈ ఉపోద్ఘాతం ఒక ఉద్దేశంతోనే రాశాను. విద్యార్థులు, విద్యార్థినులు మరీ ఎడంగా ఉండటంవల్ల-ఎవరో మరీ దగ్గిర చుట్టాలు తప్ప-ఎదిగిన ఆడపిల్లలను వింతగా చూసే ధోరణి తప్పడం లేదు. అందుకనే ఈ కథలు అంత ప్రచారంలో ఉన్నాయనుకుంటాను.

'విమల' (కావలి)

## కాలేజీ ఎన్నికల రాద్ధాంతం

ఎన్నికలు అయిపోయాయి. దేశమంతటా ఒక పెద్దతుపానులేచి అణగారిపోయినట్లుంది. ఇది అయిదేళ్ళ కొకసారి జరిగేది. కాని మన కాలేజీలలో ఏ టేటా ఏదో ఎన్నికలు జరుగుతూనే ఉంటాయి. ఈ ఎన్నికలు 'సార్వత్రిక ఎన్నికల'కు ఏవిధంగానూ తీసిపోవు! అదే కోలాహలం; అంత తీవ్రంగానూ ఉంటే వాద వివాదాలు; ఇవి ఎంత అసహ్యంగా ఉంటాయో చెప్పలేం!

కాని వాటి ఖండన అంతముఖ్యమైనది కాదు. గొడవ అధికంగాఉంటే దూరంగా ఉండొచ్చు. ఈ పరిస్థితులు మన విద్యార్థుల మనస్తత్వాలు బయట పెడ్తాయి. సాధారణంగా మధ్యతరగతిలో పైమెట్టుకి (ఆర్థికంగా) చెందినవారే ఆవేశంగా సంఘసంస్కరణ మొదలైన విషయాలను గురించి మాట్లాడుతారు. అంతర్జాతీయ రాజకీయాలు చర్చిస్తారు. పురోగమనం కావాలని రమారమి ప్రపంచంలో అందరినీ ఖండిస్తారు.

వీరే ఇంటికివెళ్ళి నౌకర్ల చేత అన్ని పనులూ చేయించుకుంటారు. తల్లిచాటు బిడ్డలుగా మంచి సంబంధాలు చూసి పెళ్ళివారంటే కులుకుతూ చేసుకుంటారు. ఆపైన వ్యాపారమో లేక పెద్దకంపెనీలలో ఉద్యోగాలో చేసుకుంటూ కొత్త అవతారం ఎత్తుతారు – లేక ఆశ్రమం స్వీకరిస్తారనాలా?

అందుకనే ప్రతి వైరాగి వెంటా, 'స్వాములవారి' వెంటా రిటైరు కానున్న ప్రభుత్వోద్యోగులూ, అధికారులూ మూగి ఉండటంచూసి ఆశ్చర్యపడక్కరలేదు!

కె. వి. సీతారాం, (విజయవాడ) ★



"పాము–జంతువు" లలితకళా అకాడమీ వారు ఢిల్లీలో జరిపిన జాతీయ చిత్రప్రదర్శనంలో బహుమతిపొందిన శ్రీ ఎం. రెడ్డప్పనాయుడుగారి చిత్రం

మార్చి విడుదల!

శ్రీ వెంకటేశ్వర ప్రొడక్షన్స్ సమర్పించు

# శ్రీ వళ్లీ కళ్యాణం

(సుబ్రహ్మణ్యస్వామి మహాత్మ్యం)

పూర్తి పంచరంగుల చిత్రం

మాటలు-పాటలు: శ్రీ శ్రీ

సంగీతం: టి. చలపతిరావు

దర్శకుడు: టి. ఆర్. రామన్న

CHITRALEKHA

డిస్ట్రిబ్యూటర్లు ఆంధ్ర: గౌతమి, సీడెడ్: భాస్కర్, నైజాం: వాణి.

diEted, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street
Madras-1. Chief Editor . S Sambhu Prasad,



నిరర్థక బ్రతుకు

ఫోటో పి ప్రభాకర్ (మద్రాసు)